# శ్రీ షిర్డీసాయినాథ మహాత్మ్యము

(వేదోక్త పూజా వ్రతకల్పము)

రచన:

శ్రీ పేరూరు శర్మ

(కట్టా సుబ్బరాయశర్మ - పేరూరు)



ప్రచురణ:

శ్రీసాయి రిలీఫ్ సర్వీస్

కాకినాడ.



కృతిభర్త

శ్రీరామ, కృష్ణ, శివ, మారుతి, దత్త, నాగాది బహురూప

చతుర్దశ భువన సమ్రాట్

# శ్రీ షిర్డీ సాయిబాబా

## సమర్పణ

నాగకోటివంశపుభోగికి - విరాగికి,
ఆర్తులపాలిటి - అమరతరువు
చింతకు వశమౌ - చింతామణి
నా ముంగొంగు పసిడి
వింతరూపులు దాల్చు
నా సొంత దేవుడు
శ్రీ సాయికి
అంకితము.

—శర్మ

# శ్రీ సాయి ప్రసాదించిన ఏకాదశ సూక్తులు

1 శ్రీ షిర్డీ ప్రవేశమే సర్వదుఃఖపరిహారము.

2 ఆర్తులైన నేమి- నిరుపేదలైన నేమి "ద్వారకమాయి మసీదు" ప్రవేశించినంతనే సుఖ సంపదలు పొంద గలరు.

3 నన్నాశ్రయించిన వారిని, నా శరణు జొచ్చినవారిని రక్షించుటయే నా కర్తవ్యము.

4 నాయందెవరికె దృష్టియో వారియందే నా కటాక్షము.

5. మీ భారములు నాపైన ఉంచుడు. నేను మోసెదను.

6 నా సహాయముగాని_సలహాగాని కోరిన తక్షణమే ఒసంగ సంసిద్ధుడను.

7 నా భక్తులయింట "లేమి" యనునది లేదు.

8 నా భౌతికదేహానంతరమున గూడ నేను అప్రమత్తుడనే.

9 నా సమాధినుండియే నేను సర్వకార్యములు నిర్వహింతును.

10 నా సమాధినుండి నా మానుషశరీరము మాట్లాడును.

11 నా భక్తుల రక్షణము నా సమాధినుండియే వెలువడుచుండును.

ఓం నమో శ్రీ సాయి

# గ్రంథ ప్రశంస

ఈ పొత్తమునకు నన్ను పీఠిక వ్రాయుడని శ్రీ శర్మగారు కోరిరి. వ్రతమాహాత్మ్యములు, పూజాగ్రంథములు మొదలగు వానికి పీఠికతో బనిలేదు. ఎవరి నమ్మిక వారిది. పేరెక్కిన సాయిభక్తులనబడు శ్రీ కేశవయ్యగారు (మదరాసు), శ్రీమతి క్రిష్ణాబాయి (రామచంద్రపురము), శ్రీ ఓంకారస్వామి (శాంతి ఆశ్రమము) మొదలగువా రుండ నన్ను పీఠిక వ్రాయుమని కోరుటకు శ్రీ శర్మగారికి శ్రీ సాయీశుని యెడలను నాపట్లను గల నమ్మికయే కారణము.

ఈ వ్రతమాహాత్మ్యము వేరొక గ్రంథసహాయముగాని, వ్యక్తి సహాయముగాని కోరక, ఎవరికివారు వినాయకపూజ మొదలు, ధ్యాన, ఆవాహన, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, స్నానము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, అక్షతలు, పుష్పపూజ, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, మంత్రపుష్పము అను షోడశోపచారముల నొసగి శ్రీ సాయిపూజను వేదోక్తముగను, కల్పోక్తముగను గావించుటకు వీలుగ వ్రాయబడినది. ఈవిషయమున దీని కిదియే సాటి యనవచ్చు.

అంగపూజయు, 'శ్రీ సాయీశ' నక్షత్రమాలాగర్భిత అష్టోత్తరశతనామావళియు, నీగ్రంథమునకు ప్రత్యేకత నొసగుచున్నవి. ఇందు వాడబడిన ప్రతిపదమును విశేషార్థపూరితమని సాయిభక్తులు గ్రహింపగలరు.

గ్రంథకర్త యీగ్రంథము వ్రాయుట కొకసుస్వప్నము కారణమని తెలిపియే యున్నారు. ఆంధ్రవాఙ్మయనిర్మాత లెందరో పూర్వము స్వప్నముపై ఆధారపడియే తమ తమ కృతుల వెదజల్లినట్లు ఆయా గ్రంథములనే కలదు. కావున స్వప్నమాచారపరంపర యగు ఆధారమే.

"కలయే మూలన్" "కల్ల నిజము" అను పదముల సారమెరిగినవారు శర్మగారి సుస్వప్నపు విలువ గ్రహింప గలరు.

సుప్రసిద్ధ సాయీభక్తిప్రచారకులగు కీ॥ శే॥ బి. వి. నరసింహస్వామివారు శ్రీసాయి సాక్షాత్ "మహావిష్ణువే" యని నుడివియున్నారు. మన శర్మగారు ఆయన "శ్రీ శంకరుడు" కావచ్చు నని సరిపోల్చియున్నారు.

హరియైన నేమి ? హరుడైన నేమి ? హరిహరుడైన నేమి ? త్రేతాయుగ అవతారమూర్తియగు శ్రీరామునికంటెను, ద్వాపరావతార మగు శ్రీకృష్ణుని కన్నను మిన్నయే అనవచ్చు. ఆ రెండవతారములును శ్రీమహావిష్ణువుయొక్క అంశాభాగములుమాత్రమే. శ్రీరాముడు రావణవధానంతరము నేడు రామేశ్వరమనబడు తావున "రామలింగేశ్వర"

ప్రతిష్ఠ జేసి శివుని కృపకొరకు ఆయనను పూజించినట్లు చదువరులు చదివియుండవచ్చు పురాణములలో.

'శివునిపుట్టుక తెలియనట్లే శ్రీసాయిపుట్టుకగూడఅగోచరము'

నేడు మనలో పురాణగాథలు కల్పితములు, (Myths) అనువా రొక తెగవా రున్నారు. రాముడు దేవుడైన కోతుల సాయ మపేక్షించుట యేమని అపహాస్యముచేయు అన్య మతావలంబులును కలరు. శ్రీకృష్ణుడు సాక్షాత్ జగన్నా టక సూత్రధారి యని అర్జును డాయనకు దోయిలింప, "గాండీవా" డీతడని పరిహాసించుటకు దుర్యోధనుడును వాని యనుచరులు నుండిరి. ప్రతిదేశమునను ప్రతికాల మునను ఎవరి దృక్పథమునుబట్టి వారు గుణగ్రహణు లగు చున్నారు.

ఆయా చరిత్రలు కల్పితములైనను, సత్యమైనను, వారి వారి జీవితముల—ఆయా పాత్రలనుండి నేర్చుకొని అవలంబింప వలసిన ఆదర్శకములగు నియుతులు కలవు.

నేటి మానవులు కొందరు శ్రీ సాయి విప్రుడా? మహమ్మ దీయ ఫకీరా? సిద్ధపురుషుడా? రామకృష్ణుల పూజించు మే మీయన నెట్లు పూజించుట యను సంశయములకు లోనైయున్నారు. మరికొందరు "రాముడు సాయివ్రత మాచరించెనా?" యని ఆశ్చర్యచకితు లగువారున్నారు.

శ్రీసాయి ధేయుడే (దేవుడే) కావచ్చు, కాకపోవచ్చు. హిందువు కావచ్చు. మ్లేచ్ఛుడు కావచ్చు, వానితో పనియేమి? "సర్వజీవప్రేమ", "సర్వమత సహనము" "నిరాడంబరజీవనము" మొదలగు సద్గుణములను మనము గ్రహించుటకవకాశ మున్నదా లేదా? జాతితో పనియేమి? నిన్న మొన్నటి మన గాంధిమహాత్ముని కులమేమి? ఆయన ఆర్జించిన ఘనమేమి? ఆనాడు, ఈనాడుగూడ ఆయనను పూజించుటలేదా?

"క్రియాసిద్ధి స్సత్త్వే, భవతి మహతాం నోపకరణే"

సాత్త్వికప్రవృత్తిగల మహనీయులకు పరికరము లక్కరలేకనే క్రియాసిద్ధి సాధ్యముకదా? అట్టివారు పూజ్యులుకారా? భక్తపోతన శ్రీనాథునకు కఱపిన నియతి ఇదియేకదా!

రాముడు క్షత్రియుడు; కృష్ణుడు గొల్ల; వ్యాసుడు దాసకన్యాసూనుడు. ఇక వాల్మీకి చెప్పనేల? కావున మహనీయుల కులము తరచు టొక గుణముగాదు. ఇం దొక్కరును విప్రులు గారే!

పూర్వకాలమున ఇన్ని కులములుగాని ఇన్ని మతములుగాని లేవు. ఒక్కటే మానవజాతి యంతయు. కాలచక్రము తిరిగి తిరిగి మరల మొదటితావునే నిలచును. తొల్లిటి తీరిక జాతిభేదము లుడిగి మానవజాతి అంతయు నొకటేకావచ్చు. ఇది విరుద్ధవిషయము కాదు.

ఒక్కొక్క భూమియందు, ఒక్కొకకాలమునందు కొన్నికొన్ని పుష్పములు పుష్పించి తమ సుసౌరభమును జీవులకు అభేదముగ వెదజల్లునట్లు, ఒక్కొకదేశమునం దొక్కొకకాలమున ఆకాలపు ప్రజల విజ్ఞానము నభివృద్ధిచేయుటకు మహాత్ము లవతరించి ఆదర్శకజీవులై నియతి బోధించుట చారిత్రికమగు విషయము.

తన సుసౌరభ మేవ్యక్తులు ఆఘ్రాణించుచున్నారు, ఎవ రాఘ్రాణించుటలేదని గుర్తించునా పుష్పము ? ప్రతిఫలాపేక్ష లేక సుసౌరభము వెదజల్లి వాడి వత్తులై వేరగుచున్నవి. అట్టివే మహనీయుల జీవితములు, మతప్రవక్తల సుభాషితములు. ఏపుష్పసౌరభము ఘనమని, దేనిని లూనమని నిర్ణయింపగలము ? "లోకో భిన్నరుచిః" అని ఎవరిహితవు వారిది. మతములును. మహాత్ములును అట్టి సుసౌరభ పూరిత సుమములవంటివారే !

రామాయణకాలమునకు పూర్వముగూడ తారక బ్రహ్మము నుపాసించు మహర్షు లుండిరి. ద్వాపరయుగంబునకు పూర్వము కృష్ణుని హృత్పుండరీకమున ధ్యానమొనర్చెడి మౌనులును కలరు. ఆయా నామములు తొలితూరి ఆయా యుగములనే రేకెత్త లేదు. తాతపేరు మనుమని కిడునట్లు ఆయా అవతారనామముల మూలము పూర్వయుగంబుల లేకపోలేదు.

అట్లే శ్రీ సాయీశుని నామము కలిలో పందొమ్మిది- ఇరువదవ శతాబ్దములనే ఉత్పన్నముకాలేదు. పూర్వగాథ లెన్నో కలవు. కావున రామకృష్ణులు శ్రీ సాయిని పూజించి రన్నదానిలో ఎంతో అర్థమున్నది.

"తరచిన కొలది నవనీతము" అన్నట్లు శ్రీ సాయి జీవిత రహస్యముల నెరుంగుటకు మానవమాత్రుల శక్తి చాలదు. అవి "అయోనీసంభవు" "అయోమయపు వింతలే" యగు.

కాకినాడ
23—7—58

సంపర



కృతికర్త
శ్రీ పేరూరు శర్మ
(కఱ్ఱా సుబ్బరాయశర్మ - పేరూరు)

"ఊహించి రాముకు రోహిణి కొడుకంచు, నప్పుడు యోగీంద్ర చెప్పితీవు" (భాగవ. దశ. ౧ భాగ. ౯ పద్యం) అనురీతి నవీన చరిత్ర శోధకులు ఊహించి శ్రీసాయి పత్రి గ్రామము నందు ఒక విప్రుని యింట బుట్టెనని వ్రాసిరేగాని, దానికి సరి యగు నిదర్శనము లేదు.

నిజమునకు శ్రీసాయిబాబా జన్మరహస్యమేమో తెలి సినవా రింతవరకు లేరు. బాబా తన భౌతిక దేహంతో షిర్డీ యందున్న 60 సంవత్సరములలోనూ, ఏ ఒక్క రోజునా, ఏ ఒక్క భక్తునికీ గూడ తన జన్మరహస్యాన్ని ఎరింగించ యిష్టపడ లేదు. అందుల కేమిహేతువో ఆ ప్రభువున కే ఎరుక. వీరు అయోని సంభవులో లేక యోనీ సంజాతులో తెలిసినవారు అసలే లేరు. ఈ గాథ చిత్రతరము. రహస్యాతి రహస్యముగ పరిగణింప బడియున్నది.

ఈ "సాయి" అను నామమున కీవరకు గ్రంథకారులు అనేక అర్థముల తెలిపియే యున్నారు. "రంగసాయి" లేక "రంగ శాయి" అని విష్ణుపరముగ వాడెడి పదమందలి ఉత్తరపదమే శ్రీ సాయి విష్ణువంట కావచ్చునను దేవరహస్యము వెలిబు చ్చును. సాయియే విష్ణుమూర్తి యని కొందరుభక్తులు అభి ప్రాయపడి యున్నారు. వారియూహ కేవలము సత్యదూరము కాకపోయినను, నిత్యవిలాసప్రియుడగు విష్ణువునకును, ఆయన అవతారలీలలకును, శ్రీ సాయినాథుని జీవితమునకు హస్తిమశ

కాంతర భేదము కనవచ్చుచున్నది. మన పురాణాదులు మనకు తెలుపునంతవరకు విష్ణు వెప్పుడును నిట్టి "భిక్షుక జీవితము" నెర పెడి అవతార మెత్తియుండలేదు.

ఆది భిక్షుడన శంకరునకు వర్తించు. సాయియే ఈశుడా? కాకున్న యీపురుషోత్తము డెవరు ? వీరి తత్పూర్వగతి ఎద్ది ?

శ్రీ సాయిభగవానుని మానవజీవితమందలి ముఖ్యఘట్టములు, అందలి విచిత్ర సంఘటనలు హేమాత్పంతు వ్రాసిన సచ్చరిత్రమున సత్యముగ వర్ణింపబడినవి. శ్రీసాయి యిహజీవితమున ఆయన షిర్డీలో గడిపిన పలువత్సరములలో ఆ మహాపురుషుడు చూపిన మహిమలు అంతకంతకు మిన్నలై వన్నె కెక్కినవి. ఈ మహాపురుషుడు మానవదేహమును వీడినపిదప 1918 సం॥ నుండి నేటిదనుక చూపుచున్న మహామహిమలు అంతకంటె ఘనమైనవి. ఏభక్తు డెరిగినంతవర కాభక్తు డాత్మానంద మొందవలసినదే గాని, చరిత్రరూపమున చిత్రించుట కలవి గాదు.

శ్రీసాయి పూర్వజన్మలో "కబీరు" తానని చెప్పిన శ్లోకవిషయము చరిత్ర కెక్కినది. ఇందలి సత్యాసత్యముల నిర్ణయించుట కాధారము లేదు. "కబీరు" ఒక రామభక్తుడని మాత్రమే మనకు తెలిసిన విషయము.

కబీరు శ్రీరామచంద్రుని స్మరింపుచు రామభక్తిని ప్రదర్శించెను. కాని శ్రీ సాయి తానే రామ, కృష్ణ, శివ,

మారుతి, దత్త, నాగాది స్వరూపుడనని భక్తుల ననుగ్రహించెను. ఈ రెండు జన్మముల తారతమ్యమును గమనించిన, ఉత్తరజన్మ మిన్న.

సామాన్యమానవుడైన ఒకజన్మకంటె మరియొక జన్మమున జ్ఞానమార్జించి "సాయుజ్య" మని వాడబడెడి (Unity with God) కు పరిపక్వమగుచున్నట్లు సమాధానమీయవచ్చు. ఈ పురుషోత్తముడు మానవమాత్రుడా ? వీరెవరు ? వీరు జనన మరణచక్రగతికి చిక్కిరా ?

శ్రీసాయి తాను సర్వాంతర్యామినని, సర్వజీవులలో నుంటినని గుణపాఠము భక్తులకు బోధించిరి. అది గ్రహించిన వారు గ్రహించిరి. శునకరూపమున, పిపీలికారూపమున, మహిష రూపమున భక్తులు తనకొఱకు నుద్దేశించిన ప్రసాదలబ్ధములగొని, వారిని చకితులచేసిన మహనీయుడు.

శ్రీసాయి శునకమునం దేభాగమో, మహిషమునం దేయంశమో, రామునియందును కృష్ణునియందును దత్తాత్రేయాది తదితర రూపముల "అంతరాత్మ" యనబడు "ఆ చైతన్యాంశమే". అందులకే తాను రామకృష్ణాది రూపుడ ననెను. ఆయంశ మెట్టిది ?

సూటియగు సమాధానమిది :

చైతన్యం మాయయా యుక్తం జీవ ఇత్యభిధీయతే
ఉపాధిరహితం తచ్చ బ్రహ్మేతి ప్రోచ్యతే బుధైః॥

ఉపాధి మాయ, అదే మేను. ఉపాధిరహితం బ్రహ్మ, అదే జ్యోతి, అదే అంతరాత్మ. యోగిపుంగవులు తమతమ హృత్పుండరీకమునం దేనిర్గుణ బ్రహ్మమును ఉపాసనచేతురో, ఆ నిర్గుణ బ్రహ్మ సాయి. ప్రతిజీవికిని "అంతరాత్మ" సాయి. బ్రహ్మంబన బడు యీ చైతన్య ఘనమేల మాయతో గలసె? మానవరూపములు ధరించె? అదే తెలుసుకొనవలసిన రహస్యము! ఇట్టి సందర్భమున మనపూర్వులు—

దైవే తీర్థే ద్విజే మంత్రే। దైవజ్ఞే భేషజే గురౌ
యాదృశీ భావనాయస్య। సిద్ధిర్భవతి తాదృశీ॥

దైవము, పుణ్యతీర్థములు, విప్రులు, మంత్రములు, వైద్యులు, దైవజ్ఞులు, గురువు అనువారల నేదృష్టితో భావించి చూచిన అట్టిఫలమే లభించు నని చెప్పియున్నారు.

శర్మ,

రచయిత.



# పూజ

పూజ రెండువిధములు :_ అందు మొదటిది "మానసికపూజ." ఇష్టదేవుని హృదయమున నిలిపి, ధ్యాన ఆవాహనాది షోడశోపచారములు మనసున కల్పించి పూజించుట. ఇదే మానసికపూజ యనబడును. ఇది విశేషఫలదాయకము, అభ్యాసముచే అలవరచుకొనవలసినది యగును.

రెండవది ఇష్టదేవుని ప్రతిమయో, పటమో పీఠముపై నిలిపి, పరికరముల గొని, ప్రాణప్రతిష్ఠాదికముల జేసి, షోడశోపచారముల నొసగి పూజించుట. ఇది సాధారణముగ నీకాలమున అందరాచరించెడి పూజావిధానము. ఇది మరల రెండు రీతులు. "పురుషసూక్త" విధాన మొకటి. "కల్పోక్త" విధాన మొకటి.

నేడు ఆంధ్రదేశమున ప్రతి పర్వదినముల యందును, శుభకార్యనిర్వహణసమయముల యందును శ్రీ సత్యనారాయణ వ్రత మాచరించు విధాన మెట్లు వ్యాప్తియం దున్నదో, అట్లే మహారాష్ట్ర దేశమందు శ్రీ సాయినాథవ్రతవిధానము బహుళ వ్యాప్తియం దుండియున్నది.

ఈ సాయీనాథమాహాత్మ్యమున పురుషసూక్తవిధానముగను కల్పోక్తవిధానముగను శ్రీ సాయీనాథుని వ్రతకల్పము వ్రాయబడినది. హితవు ననుసరించి అం దేవిధానమున

నైనను లేదా రెండు విధానములతోనైనను శ్రీ షిర్డీశ్వరుని పూజించినవారలు ఇహ పరానంద సంపత్సుఖముల నొందగల రనువిషయము నిస్సంశయము.

# త్రినాథవ్రతము

## (గ్రంథకర్త అభిప్రాయము)

నేడు ఆంధ్రదేశమందు "త్రినాథవ్రత"మని యొకటి యీనడుమ ప్రచారములోనికి వచ్చినట్లు వినుచున్నాము. త్రినాథు డన సృష్టి, స్థితి, లయములు మూడింటికిని కర్తయగు వాడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులను ముమ్మూర్తులు ప్రత్యేక మొక్కొక్కపదవిని నిర్వహించుచున్నట్లు పురాణప్రసిద్ధి. వేరు వేరు పదవుల నిర్వర్తించు వీరలలో నేయొక్కరికినీ, సృష్టి స్థితి లయముల మూడింటిని నిర్వర్తించగల హక్కు లేదు. ముమ్మూర్తుల పూర్వగాథనుబట్టి యీ "మూడు మూర్తుల ఏకరూప" మగు "శ్రీ దత్తాత్రేయు" నకు మాత్రమే యిట్టి హక్కు గలదను విషయము తెలియుచున్నది.

ప్రకృతమున "శ్రీ సాయిబాబా" యని పిలువబడు చున్న యీ అవతారమూర్తియే "దత్తాత్రేయు" డనియు, అనగా సాయిప్రభువే దత్తాత్రేయరూపమును ధరించెనని "శ్రీ సాయి సచ్చరిత్ర" యందు నిరూపింపబడినది. ఈవిష

యము "శ్రీసాయిప్రభను" పారాయణచేయు సాయి భక్తు లందరును ఎఱింగినవిషయమే !

అందులకే యీ మహనీయుని కొందరు భక్తులు దత్తాత్రేయమూర్తిగ గ్రహించి, పూజించి, ద్వారకమాయి మసీదు నందున్న సాయినాథుని దత్తాత్రేయరూపునిగ సందర్శించి, ఆత్మానంద మొందినారు. నేటికిగూడ సాయిప్రతిమయందు దత్తమూర్తిని కన్న ధన్యాత్ము లెందరో గలరని తెలియు చునే యున్నది.

నిజముగ "త్రినాథు లన దత్తమూర్తియే" అనియు దత్తమూర్తియే "సాయి ప్రభువు" గాన, త్రినాథపూజ యన సాయిదేవుని పూజించినట్లే యని అభిజ్ఞులు గ్రహింతురు గాక !

—శర్మ
రచయిత



శ్రీరస్తు
శుభమస్తు
అవిఘ్నమస్తు
శ్రీ షిర్డీ సాగ సాయి నాథాయ నమః
ఆదౌ

# విఘ్నేశ్వర పూజ

(శ్రీ సాయినాథ వ్రతదీక్షలో ప్రవేశింపబోవు వ్యక్తి
శ్రీ సాయిపూజను సక్రమముగా సాగింపుమని
ముందుగ విఘ్నేశ్వరుని ప్రార్థించవలయును.)
ారాధన చేసి గంధపుష్పాక్షతలతో అలంకరించవలెను.)

అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతో౽పి వా
య స్స్మరే త్సాయినాథాఖ్యం సబాహ్యాభ్యన్తర శ్శుచిః॥
మస్సాయీశ! నమస్సాయీశ! నమస్సాయీశ!

(3 సార్లు శిరస్సుపై ఉదకమును చల్లుకొనవలెను.)

## మ్య

(ఈదిగువ "స్వాహా" అనునపుడు ఉదకమును
లోనికి గొనవలెను.)

ఓం కేశవాయ స్వాహా! ఓం నారాయణాయ స్వాహా!
మాధవాయ స్వాహా!

ఓం గోవిందాయ నమః, ఓం విష్ణవే నమః, ఓం మధు
సూదనాయ నమః, ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామ

సాయ నమః. ఓం శ్రీధరాయ నమః, ఓం హృషీకేశాయ నమః, ఓం పద్మనాభాయ నమః, ఓం దామోదరాయ నమః, ఓం సంకర్షణాయ నమః, ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః, ఓం పురుషోత్తమాయ నమః, ఓం అధోక్షజాయ నమః, ఓం నారసింహాయ నమః, ఓం అచ్యుతాయ నమః, ఓం జనార్దనాయ నమః, ఓం ఉపేంద్రాయ నమః, ఓం హరయే నమః, ఓం శ్రీకృష్ణాయ నమః॥

(ఒక పళ్లెరమున బియ్యము పోసి, దానిపై తమలపాకు ఉంచి, కుంకుమాలంకృతుని చేసిన పసుపువినాయకుని నిలుపవలయును. తదుపరి అక్షతలు హస్తమున తీసికొని)

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే॥
యశ్శివో నామ రూపాభ్యాం యాదేవి సర్వమంగళా
తయో స్సంస్మరణా త్పుంసాం సర్వతో జయమంగళమ్॥
లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః
యేషా మిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః॥
సర్వదా సర్వకార్యేషు నాస్తి తేషా మమంగళమ్
యేషాం హృదిస్థో భగవా న్మంగళాయతనం హరిః॥
ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహం॥
సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకేదేవి నారాయణి నమోఽస్తుతే॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః, ఉమామహేశ్వ
రాభ్యాం నమః, వాణీహిరణ్యగర్భాభ్యాం నమః, శచీపురం
దరాభ్యాం నమః, అరుంధతీవసిష్ఠాభ్యాం నమః, శ్రీ సీతా
రామాభ్యాం నమః, శ్రీ షిర్డీసాయినాథాయ నమః, మాతా
పితృభ్యాం నమః, సర్వేభ్యో మహాజనేభ్యోం నమః, అయం
ముహూర్త స్సుముహూర్తోఽస్తు.

(అక్షతలు సభ్యులపై చల్లవలయును.)

ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమిభారకాః
ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥

## ప్రాణాయామ్య

### మంత్ర :

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం
జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్స వితుర్వ రేణ్యం భర్గో
దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ । ఓం మాపో
జ్యోతీరసోఽమృతం బ్రహ్మభూర్భువ స్సువరోమ్॥

## సఙ్కల్పము

మమ ఉపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర
ప్రీత్యర్థం, శుభే శోభనే ముహూర్తే, శ్రీమహావిష్ణోరాజ్ఞయా,
ప్రవర్తమానస్య, అద్యబ్రహ్మణః, ద్వితీయపరార్థే, శ్వేతవరా
హకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే,
జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, అస్మిన్ వర్తమాన

వ్యావహారిక చాంద్రమానేన......సంవత్సరే......అయనే ......మాసే......పక్షే......తిథౌ......వాసరే, శుభ నక్షత్రే, శుభయోగే, శుభకరణే, ఏవం గుణవిశేషణ విశిష్టాయాం, శుభతిథౌ శ్రీమాన్...గోత్రః...నామధేయః॥

## వి వా హం అ యి న వా రు

(ధర్మపత్నీ సమేతోఽహం శ్రీమతః.........గోత్రస్య .........నామధేయస్య ధర్మపత్నీసమేతస్య) సకుటుంబపరివారస్య మమక్షేమస్థైర్యవిజయాభయాయురారోగ్యాభివృద్ధ్యర్థం సమస్తపాపక్షయార్థం, ధర్మార్థకామమోక్ష చతుర్విధపురుష ఫలావాప్త్యర్థం, పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం, సర్వాభీష్టసిద్ధ్యర్థం, శ్రీరామకృష్ణ శివమారుతి దత్తనాగాది బహురూపచతుర్దశభువనసమ్రాట్ శ్రీ షిర్డీ సాయినాథ దేవతాముద్దిశ్య, శ్రీ షిర్డీ సాయినాథ దేవతాప్రీత్యర్థం, యావచ్ఛక్తి కల్పోక్త పురుషసూక్త విధానేన, ధ్యానాఽవాహనాది షోడశోపచారపూజాం కరిష్యే॥

(ఉదకమును స్పృశింపవలయును.)

ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే॥

(ఉదకమును స్పృశింపవలయును.)

తదంగ కలశారాధనం కరిష్యే॥

(ఉదకమును స్పృశింపవలయును.)

కలశేగంధపుష్పాక్షతైరభ్యర్చ్య హస్తేనాచ్ఛాద్య॥

(ఒక కలశమున ఉదకము నింపి, పుష్పముంచి, గంధ పుష్పాక్షతలచే అలంకరించి, దానిపై తనహస్తమును మూసి యుంచవలెను.)

కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః
మూలే తత్రస్థితో బ్రహ్మా మధ్యేమాతృగణా స్మృతాః।
కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః॥
అంగైశ్చ సహితా స్సర్వేకలశాంబు సమాశ్రితాః॥

మంత్రము:

ఆకలశేషు ధావతి పవిత్రే పరిషిచ్యతే। ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే॥

ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః పశవ ఆపోఽన్న మాపోఽమృతమాప స్సమ్రాడాపో విరాడాప స్స్వరాడాపశ్ఛన్దాగ్ం స్యాపో జ్యోతీగ్ం ష్యాపోయ జూగ్ం ష్యాప స్సత్యమాప స్సర్వా దేవతా ఆపో భూర్భువ స్సువరాప ఓమ్॥

గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధిం కురు॥

ఆయాంతు సాయిపూజార్థం గణపతి పూజార్థం చ మమ దురితక్షయకారకాః, కలశోదకేన దేవమాత్మానం పూజా ద్రవ్యాణి, అపోపకరణాని సంప్రోక్ష్య॥

(ఆ కలశమునందలి ఉదకమును సాయిదేవునిపైనను పసుపు వినాయకుని పైనను, తనపైనను, పూజాద్రవ్యముల పైనను, పూజకొఱకు ఉద్దేశింపబడిన యితరవస్తువులపైనను చల్లవలయును.)

తదంగ ప్రాణ ప్రతిష్ఠాపనం కరిష్యే॥

(ఉదకమును స్పృశింపవలయును.)

(పుష్పాక్షతలతో తనహస్తము వినాయకునిపైన ఉంచి)

మంత్ర:

అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణ మిహానో ధేహిభోగం। జ్యోక్పశ్యేమ సూర్యముచ్చరన్త మనుమతేమృళయానస్స్వస్తి॥

అమృతంవై ప్రాణా అమృతమాపః ప్రాణా నేవ యథాస్థానముపహ్వాయతే॥

స్థిరోభవ। వరదోభవ। సుముఖోభవ। సుప్రసన్నోభవ। స్థిరాసనం కురు ॥

శ్రీమహాగణాధిపతయేనమః సకలకార్యాధిపతయేనమః మహామూషకవాహనాయ నమః ప్రాణప్రతిష్ఠాపనముహూర్త స్సుముహూర్తోఽస్తు.

పుష్పం గృహీత్వా ధ్యానం కుర్యాత్॥

(పుష్పములు హస్తమున ధరించి)

భవ సంచితపాపౌఘ విధ్వంసనవిచక్షణం
విఘ్నాంధకారభాస్వంతం విఘ్నరాజ మహం భజే॥

మంత్ర:

గణానాంత్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనాముప మశ్రవస్తమం। జ్యేష్ఠ రాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృ ణ్వన్నూతిభిస్సీదసాదనం॥

శ్రీ మహాగణాధిపతయే నమః ధ్యాయామి॥

(హస్తముననున్న పుష్పములు గణపతిపై ఉంచవలెను.)

ఆవాహయామి॥ (అక్షతలు సమర్పించవలెను.)

ఆసనం సమర్పయామి॥ ( ,, )

పాదయోః పాద్యం సమర్పయామి॥ (ఉదకము చల్లాలి.)

హస్తయోః అర్ఘ్యం సమర్పయామి॥ ( ,, )

ముఖే ఆచమనీయం సమర్పయామి॥ ( ,, )

స్నపయామి॥ (ఉదకమును చల్లుచు)

మంత్ర:

ఆపోహిష్ఠా మయోభువ స్తానఊర్జేదధాతన। మహేరణాయ చక్షసే యోవశ్శివతమోరసస్తస్యభాజయతేహనః। ఉశతీరివమాతరః। తస్మాఅరఙ్గమామవో యస్యక్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః॥

శ్రీ మహాగణాధిపతయే నమః శుద్ధోదకస్నానం సమర్పయామి॥

స్నానానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి॥

(ఉదకమును విడువవలయును.)

## వ స్త్ర ము :

మ ం త్ర :

అభివస్త్రాసు వసనాన్యర్షాభిధేనూ స్సుదుఘాః పూయమానః । అభిచంద్రా భర్తవేనో హిరణ్యాభ్యశ్వా స్రథినో దేవ సోమ॥

శ్రీ మహాగణాధిపతయే నమః వస్త్రయుగ్మం సమర్పయామి ॥

(వస్త్రద్వయమును సమర్పించవలెను.)

## య జ్ఞో ప వీ త ము :

మ ం త్ర :

యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ । ఆయుష్యమగ్రియం ప్రతిముఞ్చశుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥

శ్రీ మహాగణాధిపతయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి ॥

(యజ్ఞోపవీతము సమర్పించవలయును.)

## చ ం ద న ము :

గంధద్వారాన్ ధురాధర్షా న్నిత్యపుష్టాం కరీషిణీం
ఈశ్వరీం సర్వభూతానాం తా మిహోపహ్వాయే శ్రియం॥

శ్రీ మహాగణాధిపతయే నమః దివ్య శ్రీచందనం సమర్పయామి॥

(గంధమును సమర్పించవలయును.)

## అలంకారము:

ఆయనేతే పరాయణే దూర్వారోహంతు పుష్పిణీః
హ్రదాశ్చపుండరీకాణి సముద్రస్య గృహా ఇమే॥
శ్రీ మహాగణాధిపతయేనమః అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి॥

(అక్షతలు సమర్పించవలెను.)

## అథ వినాయక పూజా:

(అక్షతలుతోగాని, పుష్పములుతోగాని పూజించవలెను.)

1 ఓం సుముఖాయ నమః 2 ఓం ఏకదంతాయ నమః 3 ఓం కపిలాయ నమః 4 ఓం గజకర్ణాయ నమః 5 ఓం లంబోదరాయ నమః 6 ఓం వికటాయ నమః 7 ఓం విఘ్నరాజాయ నమః 8 ఓం గణాధిపాయ నమః 9 ఓం ధూమకేతవే నమః 10 ఓం గణాధ్యక్షాయ నమః 11 ఓం ఫాలచంద్రాయ నమః 12 ఓం గజాననాయ నమః 13 ఓం వక్రతుణ్డాయ నమః 14 ఓం శూర్పకర్ణాయ నమః 15 ఓం హేరంబాయ నమః 16 ఓం స్కంధపూర్వజాయ నమః॥ ఓం శ్రీమహాగణాధిపతయే నమః షోడశనామ పూజాం సమర్పయామి॥

## ధూపము:

(అగురువత్తులు వెల్గించి చూపించాలి.)

వనస్పతిభవై ర్దివ్యైః నానాగంధై స్సుసంయుతః
ఆఘ్రేయస్సర్వదేవానాంధూపోఽయం ప్రతిగృహ్యతామ్॥

శ్రీ మహాగణాధిపతయే నమః ధూపమాఘ్రాపయామి॥

## దీపము :

(దీపమును చూపించవలయును.)

సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం మయా
గృహాణ మంగళం దీపం త్రైలోక్యతిమిరాపహమ్॥
భక్త్యా దీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే
త్రాహి మాం నరకా ద్ఘోరా ద్దివ్యజ్యోతి ర్నమోఽస్తుతే॥

శ్రీ మహాగణాధిపతయే నమః దీపం దర్శయామి
ధూపదీపానంతరం ఆచమనీయం సమర్పయామి॥

(ఉదకమును విడువవలయును.)

## నైవేద్యము :

మంత్ర :

ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్॥

(నివేదనపదార్థముపై ఉదకమును చల్లవలయును.)

మంత్ర :

పగలు :-సత్యం త్వర్తేన పరిషించామి॥
రాత్రి :-ఋతంత్వా సత్యేన పరిషించామి॥
అమృతమస్తు అమృతోపస్తరణమసి॥

(నివేదనపదార్ధములచుట్టూ ఉదకమును త్రిప్పి కొద్ది నీటిని విడువవలయును.)

త్రైలోక్యమపి నైవేద్యం న తే తృప్తిస్తదా బహిః
నైవేద్యం భక్తవాత్సల్యాద్గృహాణగణనాయక ॥

శ్రీ మహాగణాధిపతయే నమః మహానైవేద్యం సమర్పయామి॥

మంత్ర :

ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయస్వాహా। ఓం ఉదనాయస్వాహా। ఓం సమానాయస్వాహా॥

(నివేదనపదార్థము స్వామికి అర్పించవలయును.)

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి॥

(ఉదకం విడువవలెను.)

మంత్ర :

| | |
|---|---|
| అమృతాపిధానమసి॥ | (ఉదకమును విడువవలెను. |
| ఉత్తరాపోశనం సమర్పయామి॥ | ( ,, ) |
| హస్తౌ ప్రక్షాళయామి॥ | ( ,, ) |
| పాదౌ ప్రక్షాళయామి॥ | ( ,, ) |
| శుద్ధాచమనీయం సమర్పయామి॥ | ( ,, ) |

## తాంబూలము:

(తాంబూలం సమర్పించాలి.)

పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీదళై ర్యుతం
ముక్తాచూర్ణసమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం॥
శ్రీ మహాగణాధిపతయేనమః తాంబూలం సమర్ప
యామి॥

## నీరాజనం:

(హారతి వెలిగించి చూపించవలెను.)

కర్పూరవర్తిసంయుక్తం గోఘృతేన సుపూరితం
నీరాజనం గృహాణేదం కృపయా భక్తవత్సల॥
శ్రీ మహాగణాధిపతయే నమః నీరాజనం సమర్ప
యామి॥

నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి॥

(ఉదకమును విడువవలయును.)

## మంత్రపుష్పం:

(దక్షిణతో పుష్పమును సమర్పించవలెను.)

సుముఖ శ్చైకదంత శ్చ కపిలో గజకర్ణకః
లంబోదర శ్చ వికటో విఘ్నరాజో గణాధిపః
ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః
వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబస్స్కంధపూర్వజః.

షోడ శైతాని నామాని యః పఠే చ్ఛృణుయా దపి
విద్యారంభే వివాహే చ ప్రవేశే నిర్గమే తథా
సంగ్రామే సర్వకార్యేషు విఘ్న స్తస్య న జాయతే॥

మంత్ర:

గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా
ముప మశ్ర వస్తమం జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆన శ్శృణ్వన్నూతిభిస్సీదసాదనం॥

శ్రీ మహాగణాధిపతయే నమః సువర్ణమంత్రపుష్పం సమర్పయామి॥

నమస్కారం:

(నమస్కరించాలి)

ఆయుర్దేహి యశో దేహి శ్రియం సౌఖ్యం చ దేహి మే
పుత్రాన్ పౌత్రాన్ ప్రపౌత్రాంశ్చ దేహిమే గణనాయక॥

శ్రీ మహాగణాధిపతయే నమః ప్రార్థన నమస్కారాన్ సమర్పయామి॥

ఆత్మ ప్రదక్షిణ:

(ముమ్మారు ప్రదక్షిణముచేయవలెను.)

ప్రదక్షిణత్రయం దేవ ప్రయత్నేన మయా కృతం
దాసో హమితి మాం మత్వా క్షమస్వ గణనాయక॥

శ్రీ మహాగణాధిపతయే నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి॥

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప
యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తు తే॥

అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా చ, భగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతి స్సుప్రీతో సుప్రసన్నో వరదో భూత్వా॥

ఉత్తరే శుభ కర్మణ్య విఘ్నమస్త్వితి భవంతో బ్రువంతు॥ ఉత్తరే శుభకర్మణి అవిఘ్నమస్తు॥

శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసాగృహ్ణామి॥

(పూజించిన అక్షతలు తన శిరమున దాల్చవలయును.)

## ఉద్వాసనం:

సహస్రపరమాదేవీ శతమూలా శతాంకురా
సర్వగ్ంం హరతు మే పాపం దూర్వా దుస్వప్ననాశనీ॥

## మంత్ర:

యజ్ఞేనయజ్ఞమయజన్త దేవాస్తానిధర్మాణిప్రథమాన్యాసన్
తేహనాకం మహిమానస్సచన్తే యత్రపూర్వే సాధ్యాస్సంతి దేవాః॥

శ్రీ మహాగణాధిపతిం యథాస్థాన ముద్వాసయామి॥

(వినాయకునిపైపుష్పాక్షతలు చల్లి ఉత్తరదిక్కునకు ఎత్తి కదల్చవలయును.)

శోభనార్థం పునరాగమనాయ చ॥

విఘ్నేశ్వర పూజ సమాప్తం.

ఓం నమో శ్రీ సాయి!

## ఘంటానాదం కృత్వా:

(ఈదిగువ శ్లోకమును చెప్పుచూ ఘంటానినాదము చేయవలయును.)

ఆగమార్థస్తు దేవానాం గమనార్థం తు రక్షసాం
కురు ఘంటారవం తత్ర దేవతాహ్వానలాఞ్ఛనమ్॥
ఆగచ్ఛంతు సురా స్సర్వే నిర్గచ్ఛంతు చ రాక్షసాః
ఇతి ఘంటాన్ నినాదేన పూజాకాలకృతేన వై॥

## ఆచమ్య

(ఈదిగువ "స్వాహా" అనునపుడు ఉదకమును లోనికి గొనవలెను.)

ఓం కేశవాయ స్వాహా! ఓం నారాయణాయ స్వాహా! ఓం మాధవాయ స్వాహా!

ఓం గోవిందాయ నమః, ఓం విష్ణవే నమః, ఓం మధుసూదనాయ నమః, ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామనాయ నమః. ఓం శ్రీధరాయ నమః, ఓం హృషీకేశాయ నమః, ఓం పద్మనాభాయ నమః, ఓం దామోదరాయ నమః, ఓం సంకర్షణాయ నమః, ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయ నమః, ఓం అనిరుద్ధాయ నమః, ఓం పురుషోత్తమాయ నమః, ఓం అధోక్షజాయ నమః, ఓం నారసింహాయ

నమః, ఓం అచ్యుతాయ నమః, ఓం జనార్దనాయ నమః, ఓం ఉపేంద్రాయ నమః, ఓం హరయే నమః, ఓం శ్రీకృష్ణాయ నమః॥

ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతే భూమిభారకాః
ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥

## ప్రాణాయామ్య

**మంత్ర :**

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ । ఓ మాపో జ్యోతీరసో౽మృతం బ్రహ్మభూర్భువ స్సువరోమ్॥

## సఙ్కల్పము

మమ ఉపాత్తదురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం, శుభే శోభనే ముహూర్తే, శ్రీమహావిష్ణోరాజ్ఞయా, ప్రవర్తమానస్య, అద్యబ్రహ్మణః, ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన......సంవత్సరే......అయనే ......మాసే......పక్షే......తిథౌ......వాసరే, శుభ నక్షత్రే, శుభయోగే, శుభకరణే, ఏవం గుణవిశేషణ విశిష్టాయాం, శుభతిథౌ శ్రీమాన్...గోత్రః...నామధేయః॥

## వివాహం అయినవారు

(ధర్మపత్నీ సమేతోహం శ్రీమతః.........గోత్రస్య .........నామధేయస్య ధర్మపత్నీసమేతస్య) సకుటుంబపరివారస్య మమ క్షేమస్థైర్యవిజయాభయాయురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం సమస్తపాపక్షయార్థం, ధర్మార్థకామమోక్ష చతుర్విధపురుష ఫలావాప్త్యర్థం, పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం, సర్వాభీష్టసిద్ధ్యర్థం, శ్రీరామ కృష్ణ శివ మారుతి దత్త నాగాది బహురూపచతుర్దశభువనసమ్రాట్ శ్రీ షిర్డీ సాయినాథ దేవతాముద్దిశ్య, శ్రీ షిర్డీ సాయినాథ దేవతాప్రీత్యర్థం, సమ్భవద్భిర్ద్రవ్యైః, సంభవద్భిరుపచారైః, సమ్భవతానియమేన, యావచ్ఛక్తి కల్పోక్త పురుషసూక్త విధానేన, ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కరిష్యే॥

(ఉదకమును స్పృశింపవలయును.)

తదంగ ప్రతిమాశోధనం కరిష్యే॥

(ఉదకమును స్పృశింపవలయును.)

(సాయినాథ ప్రతిమను యీ దిగువ వేదమంత్రముచే పంచామృతములతో శుద్ధిచేయవలయును )

మంత్ర :

(పా) ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియం
భవావాజస్య సంగధే॥

(పె) దధిక్రావ్ణ్ణో అకారిషం । జిష్ణోరశ్వస్య వాజినః । సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥

(నె) శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవ సవితోత్పునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో సూర్యస్య రశ్మిభిః॥

(తే) మధువాతా ఋతాయతే మధుక్షరన్తి సిన్ధవః మాధ్వీర్నస్సన్త్వోషధీః మధునక్తముతోషసి మధుమత్పార్థివగ్ం రజః మధుద్యౌరస్తునః పితామధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తుసూర్యః మాధ్వీర్గావో భవంతునః॥

(పం) స్వాదుష్వ స్వజాయ జన్మనే స్వాదురింద్రాయ వేధసే । స్వాదుర్మిత్రాయ వరుణాయవాయవే బృహస్పతయే మధుమాగ్ం ఉదాభ్యః॥

ప్రాణప్రతిష్ఠాపన ముహూర్తః సుముహూర్తో అస్తు॥

ప్రాణప్రతిష్ఠాపన పూర్వకం శ్రీ షిర్డీ సాయినాథ ప్రతిమాం స్థాపయేత్॥

(అలంకరింపబడిన వేదికపై, శ్రీ సాయినాథుని ప్రతిమనుగాని, పటమునుగాని ఉంచవలయును. పుష్పాక్షతలు స్వామిపైన ఉంచి యీదిగువ మంత్రమును చెప్పవలయును.)

మంత్ర :

అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణ మిహానో ధేహిభోగం । జ్యోక్పశ్యేమ సూర్యముచ్చరన్త మనుమతేమృళయానస్స్వస్తి॥

అమృతంవై ప్రాణా అమృతమాపః ప్రాణా నేవ యథా స్థానముపహ్వాయతే॥

స్థిరోభవ। వరదోభవ। సుముఖోభవ। సుప్రసన్నోభవ। స్థిరాసనం కురు ॥

పుష్పం గృహీత్వా ధ్యానం కుర్యాత్॥

(హస్తమున పుష్పములు తీసుకొని ధ్యానము చెయ్యవలయును.)

## ధ్యానమ్ :

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
సాయీనాథం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

సదా నింబవృక్షస్య మూలాధివాసాత్
సుధాస్రావిణం తిక్త మప్యఽప్రియం తం
తరుం కల్పవృక్షాధికం సాధయంతం
నమామీశ్వరం సద్గురుం సాయినాథమ్॥

షిర్డీస్థోఽపి న షిర్డిస్థః అశరీరీ శరీరభాక్
గృహీతాపి న గృహ్ణాతి న భుక్త్వాపి సుపోషితః॥

తవ యశో జగచ్ఛోకనాశనం
తవ కథామృతం ప్రీతిదాయకం

స్మితసుధేక్షితం చన్ద్రవన్ముఖం
మృదుకరోత్పలం లోకమంగళమ్॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః ధ్యాయామి॥

(హస్తమునను్న పుష్పములు స్వామికి అర్పించవలెను.)

## ఆ వా హ న ము :

(కల్పో) ఆగచ్ఛాగచ్ఛ దేవేశ తేజోరాశే జగత్పతే
క్రియమాణాం మయా పూజాం గృహాణసురసత్తమ॥

(వేదో) సహస్రశీర్షాపురుషః సహస్రాక్షస్సహస్రపాత్ సభూమిం
విశ్వతో వృత్వా అత్యతిష్ఠం దశాఙ్గులమ్॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః ఆవాహయామి॥

(పుష్పమును సమర్పించవలెను.)

## సి ం హా స న ము :

(కల్పో) నానారత్న సమాయుక్తం హేమాలంకారభూషితం
ఆసనం సాయిదేవేశ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్॥

(వేదో) పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యం
ఉతామృతత్వస్యే శానః యదన్నే నా తి రోహతి॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః నవరత్నఖచిత సింహా
సనం సమర్పయామి॥

(పుష్పమును సమర్పించవలెను.)

## పాద్యము :

(కల్పో) గంగాదిసర్వతీర్థేభ్యో మయా ప్రార్థనయాహృతం
తోయమేతత్సుఖస్పర్శం పాద్యార్థం ప్రతిగృహ్యతామ్॥

(వేదో) ఏతావా నస్య మహిమా అతో జ్యాయాగ్ శ్చ
పురుషః పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యా
మృతం దివి।

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః పాదయోః పాద్యం
సమర్పయామి॥

(ఉదకమును విడువవలయును.)

## అర్ఘ్యము :

(కల్పో) నమస్తే దేవ దేవేశ శ్రీ షిర్డీవాస భో ప్రభో
నమస్తే సర్వలోకేశ గృహాణార్ఘ్యం నమోఽస్తుతే॥

(వేదో) త్రిపాదూర్ధ్వఉదైత్పురుషః పాదోస్యేహాభవాత్పునః
తతో విష్వ జ్వ్యక్రామత్ సాశనా నశనే అభి॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః హస్తయోః అర్ఘ్యం
సమర్పయామి।

(ఉదకమును విడువవలయును.)

## ఆచమనీయము :

(కల్పో) కర్పూరవాసితం తోయం దికృటీసుసమాహృతం
ఆచమ్యతాంసాయినాథ మయాదత్తం హి భక్తితః॥

(వేదో) తస్మాద్విరాడజాయత విరాజో అధిపూరుషః।
సజాతో అత్యరిచ్యత పశ్చాద్భూమి మథోపురః॥

శ్రీ షిర్డీసాయినాథాయ నమః ముఖే ఆచమనీయం సమర్పయామి॥

(ఉదకమును విడువవలయును.)

## మధుపర్కము :

(ఈ శ్లోకమును పఠింపుచు దధి మధు సహితమగు నాజ్యమీయవలయును.)

(శ్లో) మధ్వాజ్యదధిసంయుక్తం స్వర్ణపాత్రే ప్రతిష్ఠితమ్
మధుపర్కం గృహాణేదం సాయిదేవ నమోఽస్తుతే॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః మధుపర్కం సమర్పయామి॥

## పంచామృత స్నానము :

(పంచామృతములతో స్వామిని స్నానముచేయించవలెను)

(శ్లో) దధిక్షీరసమాయుక్తం మధ్వాజ్యేన సమన్వితం
స్నానం పంచామృతైర్దేవ గృహాణ పురుషోత్తమ॥

(వేదో) ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియం భవా
వాజస్య సంగధే॥

రధిక్రావ్ణ్ణో అకారిషం। జిష్ణోరశ్వస్య వాజినఃసురభి
నో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥

శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోఽప సవితోఽత్పునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో సూర్యస్యరశ్మిభిః॥

మధువాతాఽఋతాయతేమధుక్షరన్తి సిన్ధవః మాధ్వీర్న సంతోఽషధీః మధునక్తముతోఽషసి। మధుమత్పార్థివగ్ం రజః। మధుద్యౌరస్తునః పితామధుమన్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తు సూర్యః మాధ్వీర్గావో భవంతునః॥

స్వాదుష్ప స్వజాయ జన్మనే స్వాదురింద్రాయ వేధసే స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాగ్ంఽదాభ్యః॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః పంచామృత స్నానం సమర్పయామి॥

## నారికేళ స్నానము :

(కొబ్బరికాయకొట్టి, ఆనీటితో స్నానముచేయించవలెను.)

యాః ఫలనీర్యా ఫలాపుష్పాయాశ్చ పుష్పిణీః
బృహస్పతిః ప్రసూతా స్తానో ముంచన్త్వగ్ం హసః,

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః నారికేళస్నానం సమర్పయామి॥

## శుద్ధోదక స్నానము :

(శుద్ధోదకముతో స్నానము చేయించవలెను.)

(కల్పో) జహ్నుకన్యా చ కావేరీ తుంగ కృష్ణా హృతం జలం
శుద్ధోదక మిదం దేవ గృహాణ వరదో భవ||
నదీజలసమాయుక్తం మయా దత్త మనుత్తమం
స్నానం స్వీకురు దేవేశ సాయినాథ నమో స్తు తే||

(వేదో) యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వత వసన్తో
అస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మ శ్శరద్ధవిః||

మంత్ర:

ఓం ఆపోహిష్ఠామ యోభువ స్తాన ఊర్జే దధాతన మహేరణాయ చక్షసే యోవశ్శివ తమోరస స్తస్య భాజయ తేహనః ఉశతీ రివ మాతరః తస్మా అరజ్గమామవో యస్యక్ష యాయ జిన్వథ ఆపో జనయథాచనః||

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః శుద్ధోదకస్నానం సమర్ప యామి||

(శ్రీ సాయినాథుని పొడివస్త్రముతో ఒత్తవలయును.)

## వస్త్రము:

(రెండు వస్త్రములను సమర్పించవలయును.)

(కల్పో) సర్వభూషాధికే సౌమ్యే లోకలజ్జానివారణే
వాససీ ప్రతిగృహ్యేతాం మయా తుభ్యం సమర్పితే||
వస్త్రం చ సోమదైవత్యం లజ్జాయా స్తు నివారకం
వాససీ ప్రతిగృహ్యేతాం మయా తుభ్యం సమర్పితే||

(వేదో) సప్తాస్యాస న్పరిధయః త్రిస్సప్త సమిధః కృతాః
దేవా యద్యజ్ఞం తన్వానాః అబధ్నన్ పురుషం పశుం॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః వస్త్రయుగ్మం సమర్ప యామి॥

## యజ్ఞోపవీతము:

(యజ్ఞోపవీతమును సమర్పించవలయును.)

(కలో్ప) సువర్ణతంతుసంయుక్తం సర్వమంత్రార్థగోచరం
యజ్ఞోపవీతం దాస్యామి సాయిదేవ మహాప్రభో॥

(వేదో) తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాతమగ్రతః
తేన దేవా అయజన్త సాధ్యా ఋష యశ్చయే॥

## మంత్ర:

యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్య త్సహజం పురస్తాత్ । ఆయుష్య మగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోప వీతం బలమస్తు తేజః॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః యజ్ఞోపవీతం సమర్ప యామి॥

## గంధము:

(గంధమును సమర్పించవలయును.)

(కలో్ప) శ్రీఖండం చందనం దివ్యం గంధాఢ్యం సుమనోహరం
విలేపనం సురశ్రేష్ఠ చందనం ప్రతిగృహ్యతామ్॥

(వేదో) తస్మాద్యజ్ఞా త్సర్వహుతః సంభృతం పృషదాజ్యం,
పశూగ్ంస్తాగ్ంశ్చక్రే వాయవ్యాన్, ఆరణ్యా
న్గ్రామ్యాశ్చయే॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః దివ్య శ్రీచందనం
సమర్పయామి॥

## అలంకారము:

(అక్షతలు సమర్పించవలెను.)

(కల్పో) అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ రమ్యాంశ్చ శుభ
సూచికాన్
స్వీకురుష్వ మయా దత్తాన్ మమాభీష్టప్రదో భవ॥
ఆయనేతే పరాయణే దూర్వారోహం తు పుష్పిణీః
హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహే ఇమే॥

(వేదో) తస్మాద్యజ్ఞా త్సర్వహుతః ఋుచ స్సామానిజజ్ఞిరే,
ఛన్దాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ యజు స్తస్మాదజాయత॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః అలంకరణార్థం అక్ష
తాన్ సమర్పయామి॥

## పుష్పము :

(శ్రీ సాయిదేవుని పుష్పమాలాలంకృతుని చెయ్యాలి.)

(శ్లో) కల్పవృక్ష ప్రసూనైస్త్వాం పూర్వై రభ్యర్చితః సురైః
కుంకుమైః పార్థివై శ్చేభిరి దానీ మర్చ్యతే మయా॥
ఆరామ పుష్పాణి మనోహరాణి
జలాశయస్థాని సుపల్లవాని
సువర్ణపుష్పాణి మయార్పితాని
గృహాణ షిర్డీపుర సాయినాథ॥

(వేదో) తస్మా దశ్వా అజాయన్త యేకే చో భయాదతః
గావో హ జజ్ఞిరే తస్మాత్ తస్మాజ్జాతా అజావయః॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః నానావిధపరిమళ పుష్పాణి పూజయామి॥

## అథాంగ పూజా

(పుష్పములతో పూజించవలెను.)

అసమానవేగ సంచార సమర్థ శ్రీ పదద్వయాంబుజాయ నమః (పాదౌ పూజయామి.)

అసహాయ దీనజనబాంధవే నమః (గుల్ఫౌ పూజయామి.)

కాలదర్పదమనాయ నమః (జంఘే పూజయామి.)

సర్వమతసమసత్యనిత్యానందాయ నమః (జానునీపూజయామి.)

జగత్పిత్రే నమః (గుహ్యం పూజయామి.)

గుణాతీత గుణాధిక్యాయ నమః (నాభిం పూజయామి.)
నిక్షేప కుక్షిధారిణే నమః (కుక్షిం పూజయామి)
సువిశాలనవనీతహృదయాయ నమః (వక్షస్థలంపూజయామి.)
భక్తరక్షణపరతంత్రదీక్షాప్రశస్తహస్తాయ నమః (హస్తౌ పూజయామి.)
చతుర్దశభువనభారవాహపరాక్రమాయ నమః (బాహూన్ పూజయామి.)
రక్తనీలమిశ్రచిహ్నాంతవిచిత్రకంఠాయ నమః (కంఠం పూజయామి.)
శాంతస్వాంతాదిగమ్య స్మితాననాయ నమః (ముఖం పూజయామి.)
దాక్షిణీవాసిత సువక్త్రాయ నమః (వక్త్రం పూజయామి.)
సుగంధ సువాయుప్రసార సునాసికాయ నమః (నాసికాం పూజయామి.)
కోటిభాస్కరద్యుతి విరాజమానజగత్ చక్షుషే నమః (నేత్రే పూజయామి.)
సర్వదేవజీవఆర్తనాదగ్రహణప్రశస్తశ్రోత్రే నమః (శ్రోత్రే పూజయామి.)
కౌలవ్యరూపధరాయ నమః (శిరః పూజయామి.)
అద్భుతానంతచర్యాయమాన, సర్వసమర్థపరమగురు, శ్రీరామ, కృష్ణ, శివ, మారుతి, దత్త, నాగాది సర్వరూపావిష్ట, చతుర్దశ భువనాధిపతయే నమః (సర్వాణ్యంగాని పూజయామి.)

---

# అష్టోత్తరశతనామ పూజ (శ్రీ సాయీశ - నక్షత్రమాల)

1. శ్రీ షిర్డీశ్వరాయ నమః
2. సాగరగంభీరాయ నమః
3. ఈప్సితవరప్రదాయ నమః
4. శబరరూపధరాయ నమః
5. శ్రీపదాయ నమః
6. సార్వభౌమాయ నమః
7. ఈశాసక్తమనోబుద్ధయే నమః
8. శక్యాశక్యరహితాయ నమః
9. శ్రీ అనసూయాత్మజాయ నమః
10. సామగానలోలాయ నమః
11. ఈశారాధనతత్పరాయ నమః
12. శాంభవీమూర్తయే నమః
13. శ్రీ సిద్ధేశ్వరాయ నమః
14. సాధుసమ్మతహితాయ నమః
15. ఈశావాస్యార్థసూచకాయ నమః
16. శాకినీఢాకిన్యాదిదుష్టభూతగణశాసనాయ నమః
17. శ్రీ గోదావరీతటగతాయ నమః
18. సాధురూపధరాయ నమః
19. ఈతిబాధానివారణాయ నమః
20. శకటసారథిరూపధరాయ నమః
21. శ్రీ చిత్రాతి చిత్రచారిత్రాయ నమః
22. సాయీశ్వరాయ నమః
23. ఈశ్వరావతారాయ నమః
24. శారీరక, మానసిక, సర్వవ్యాధినివారణాయ నమః
25. శ్రీ అనాథ పరిరక్షకాయ నమః
26. సాయినాథాయ నమః

27. ఈర్ష్యారహితాయ నమః
28. శాంతారామాయ నమః
29. శ్రీ అవిచ్ఛిన్నాగ్నిహోత్రాయ నమః
30. సామ్యరహితాయ నమః
31. ఇష్టికాచిహ్నధరాయ నమః
32. శల్యసంధాననైపుణ్య ప్రదర్శనాయ నమః
33. శ్రీకారసంభవాయ నమః
34. సాయీరామాయ నమః
35. ఈప్సితార్థదాత్రే నమః
36. శరణాగతరక్షకాయ నమః
37. శ్రీ క్లేశనాశాయ నమః
38. సాక్షాత్కారప్రదాత్రే నమః
39. ఇహపరసుఖదాయినే నమః
40. శరసంధానమోక్షణోపసంహారవిదే నమః
41. శ్రీ సర్వసంకల్పవిన్యాసినే నమః
42. సారవిదే నమః
43. ఈషత్ శ్యామలాంగాయ నమః
44. శ్యామాసు పరిరక్షితాయ నమః
45. శ్రీ సర్వభూతాంతరాత్మనే నమః
46. సాత్త్వికాయ నమః
47. ఇక్షురసమధురనామ్నే నమః
48. శాంబరీవిద్యానిపుణాయ నమః
49. శ్రీపదాంబుజాయ నమః
50. సాకారోఽపినిరాకారాయ నమః
51. ఇక్ష్వాకువంశోద్భవాయ నమః
52. శక్తిసామర్థ్యసంయుతాయ నమః
53. శ్రీ గృహహీనమహారాజాయ నమః
54. సాధుపోషకాయ నమః

55. ఈషణత్రయవర్జితాయ నమః
56. శక్తిశాసననిపుణాయ నమః
57. శ్రీ భిక్షాధర్మమహారాజాయ నమః
58. సాయీసత్తమాయ నమః
59. ఇచ్ఛామాత్ర త్యక్తకళేబరాయ నమః
60. శ్వాన స్వరూపధారిణే నమః
61. శ్రీ అభీష్టవరవర్షిణే నమః
62. సాహసినే నమః
63. ఇచ్ఛారహితాయ నమః
64. శయ్యా సుఖవివర్జితాయ నమః
65. శ్రీ అవాఙ్మానసగోచరాయ నమః
66. సాయీ సత్యస్వరూపాయ నమః
67. ఈప్సితరూపధరాయ నమః
68. శమదమాదిసద్గుణవిరాజితాయ నమః
69. శ్రీ క్లిష్టరక్షాధురీణాయ నమః
70. సాధుజనపరిత్రాత్రే నమః
71. ఈప్సితలోకసంచారాయ నమః
72. శాంతగుణాయ నమః
73. శ్రీ మృత్యుంజయాయ నమః
74. సాయీ సర్వభూతాత్మనే నమః
75. ఈప్సిత సంతానదాయియే నమః
76. శరదృతుజాతాయ నమః
77. శ్రీ షిర్డీపురీత్యక్తకళేబరాయ నమః
78. సాక్షాత్ భగవత్యై నమః
79. ఇంద్రోత్పన్నదోషఘ్నాయ నమః
80. శతాధికవర్షవృద్ధరూపాయ నమః
81. శ్రీ ఆర్తత్రాణపరాయణాయ నమః
82. సాకారార్చసుమానితాయ నమః

83. ఇందిరారమణాయ నమః
84. శర్వాయ నమః
85. శ్రీ నిలయాయ నమః
86. సార్వభౌమాయ నమః
87. ఇంద్రాదిసేవితాయ నమః
88. శత్రుచ్ఛేదైకమంత్రాయ నమః
89. శ్రీ గుణాధిక్యాయ నమః
90. సాధుసద్భక్తసహాయాయ నమః
91. ఇతికర్తవ్యతావిదే నమః
92. శరీరానేకధారిణే నమః
93. శ్రీ భక్తసులభాయ నమః
94. సాయీభుజంగాయ నమః
95. ఇహలోకసులభప్రసన్నాయ నమః
96. శాశ్వతైశ్వర్యప్రదాయ నమః
97. శ్రీయుతమూర్తయే నమః
98. సాయుజ్యసామీప్యదాయినే నమః
99. ఇంద్రియజేత్రే నమః
100. శరదిందువికాసమందహాసాయ నమః
101. శ్రీ అష్టైశ్వర్యత్యాగినే నమః
102. సాయీ సర్వంసహాచక్రవర్తినే నమః
103. ఇందీవరదళలోచనాయ నమః
104. శార్వాణీపరిపూజితాయ నమః
105. శ్రీ నాగకోటివంశచారిత్రాయ నమః
106. సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యాద్యధిగమ్యాయ నమః
107. ఇందుధరాయ నమః
108, శాక్తేయస్వరూపాయ నమః

ఓం శ్రీరామ, కృష్ణ, శివ, మారుతి, దత్త,
నాగాది బహురూపధారిణే,
శ్రీ షిర్డీ సాయి స్వరూపాయ నమః,
నానావిధ పరిమళపుష్పాణిపూజయామి॥

---

## ధూపము:

(అగరువత్తులు, సాంబ్రాణిధూపం వెయ్యాలి.)

(శ్లో) వనస్పతి రసోద్భూతో గంధాఢ్యో గంధఉత్తమః
సాయినాథ మహారాజ ధూపోయం ప్రతిగృహ్యతామ్॥

(వేదో) యత్పురుషం వ్యదధుః। కతిధా వ్యకల్పయన్। ముఖం
కిమస్య కౌ బాహూ కావూరూ పాదా వుచ్యేతే॥
శ్రీ షిర్డీ సాయినాథాయ నమః ధూపమాఘ్రాపయామి॥

## దీపము:

(దీపం చూపించాలి.)

(శ్లో) యోగినాం హృదయేష్వేవ జ్ఞాన దీపాఙ్కురోహ్యసి
బాహ్యదీపోమయాదత్తః గృహ్యతాంభక్తగౌరవాత్॥

(వేదో) బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ బాహూ రాజన్యః
కృతః ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో
అజాయత॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః దీపం దర్శయామి॥

## నైవేద్యము :

(స్వామికి నివేదన చేయసెంచిన పదార్థము
లన్నియు స్వామి ఎదుట పళ్లెరములలో ఉంచి)

(శ్లో) త్రైలోక్యమసి నైవేద్యం నతేతృప్తిస్తదా బహిః
నైవేద్యం భక్తవాత్సల్యా ద్గృహ్యతాం సాయి దేవతే॥

(వేదో) చంద్రమా మనసో జాతః చక్షో సూర్యో అజాయత
ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయు రజాయత॥

మంత్ర :

ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో
దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్॥

(నివేదనపదార్థముపై ఉదకమును చల్లవలయును.)

మంత్ర :

పగలు : సత్యం త్వర్తేన పరిషించామి ।

రాత్రి : ఋతంత్వా సత్యేన పరిషించామి॥

(నివేదనపదార్థములచుట్టూ ఉదకమును త్రిప్పవలెను.)

మంత్ర :

అమృతమస్తు । అమృతోపస్తరణమసి॥

శ్రీషిర్డీ సాయినాథాయనమః మహానైవేద్యం సమర్పయామి॥

(ఉదకమును విడువవలయును.)

**మంత్ర :**

ఓం ప్రాణాయ స్వాహా ఓం అపానాయ స్వాహా ఓం వ్యానాయ స్వాహా ఓం ఉదానాయ స్వాహా ఓం సమానాయ స్వాహా॥

(నివేదన పదార్థములు ఆరగించుమని స్వామికి చూపించి సమర్పించాలి.)

| | |
|---|---|
| మధ్యే మధ్యే పానీయం సమర్పయామి॥ | (ఉదకము నువిడువవలెను) |
| అమృతాపి ధానమసి॥ | ( ,, ) |
| ఉత్తరాపోశనం సమర్పయామి। | ( ,, ) |
| హస్తౌ ప్రక్షాళయామి॥ | ( ,, ) |
| పాదౌ ప్రక్షాళయామి। | ( ,, ) |
| శుద్ధాచమనీయం సమర్పయామి॥ | ( ,, ) |

**తాంబూలము :**

(తాంబూలము సమర్పించవలయును.)

(శ్లో) నాగవల్లీదళోపేతం కర్పూరేణ సువాసితమ్
సాయినాథమయాదత్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్।

(వేదో) నాభ్యా ఆసీ దన్తరిక్షం శీర్ష్ణోద్యౌ స్సమవర్తత
పద్భ్యాం భూమి ర్దిశశ్శ్రోత్రాత్ తథా లోకాగ్ం అకల్పయన్॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః తాంబూలం సమర్ప
యామి।

## నీ రా జ నం:

(హారతి వెలిగించి స్వామికి చూపించవలెను.)

(కల్పో) చంద్రాదిత్యే చ ధరణీ విద్యుదగ్ని స్త్వమేవచ
త్వమేవ సర్వరూపాణి ఆర్తిక్యం ప్రతిగృహ్యతామ్॥

(వేదో) వేదాహ మేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమ
సస్తుపారే సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని
కృత్వాఽభి వదన్ యదాస్తే॥ సంతత శ్రీరస్తు; సమస్త
మఙ్గళానిభవన్తు॥ నిత్య శ్రీరస్తు; నిత్యమఙ్గళానిభవన్తు॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః ఆనందకర్పూర నీరా
జనం సమర్పయామి॥

నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి॥

(ఉదకము విడువవలయును.)

## మం త్ర పు ష్పం:

(హస్తమున పుష్పములు గ్రహించి లేచి నిలపడాలి.)

(కల్పో) దయాసాగర సాయీశ ధర్మసంస్థానపాలక
మంత్రపుష్పం ప్రదాస్యామి పుష్పాంజలి మిదంపరం॥

(వేదో) ధాతా పురస్తా ద్యముదాజహార। శక్రః ప్రవిద్వాన్ ప్రది
శశ్చ తస్రః। తమేవం విద్వా నమృత ఇహాభవతి। నాన్యః
పంథాఅయనాయవిద్యతే॥

1 సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వ శంభువమ్
విశ్వంనారాయణం దేవ మక్షరం పరమంపదం॥

2 విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిం
విశ్వమేవేద పురుషస్తద్విశ్వ ముపజీవతి॥

3 పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్॥

4 నారాయణ పరోజ్యోతి రాత్మానారాయణః పరః
నారాయణ పరంబ్రహ్మ తత్వంనారాయణః పరః
నారాయణ పరోధ్యాతా ధ్యానాం నారాయణః పరః

5 యచ్చకించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణస్థిత॥

6 అనన్తమవ్యయం కవిగ్ం సముద్రేన్తం విశ్వశంభువమ్
పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చా ప్యధోముఖం॥

7 అధో నిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాము పరితిష్ఠతి
జ్వాలమాలాకులంభాతి విశ్వస్యాయతనం మహత్।

8 సంతతగ్ం శిలాభిస్తు లంబత్యా కోశసన్నిభం
తస్యాన్తేసుషిరగ్ంసూక్ష్మం తస్మింత్సర్వంప్రతిష్ఠితమ్॥

9 తస్యమధ్యే మహానగ్ని ర్విశ్వార్చిర్విశ్వతోముఖః
సోఽగ్ర భుగ్వి భజన్తిష్ఠన్నాహారమజరఃకవిః
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయస్తస్య సంతతాః॥

10 సన్తాప యతిస్వం దేహమాపాద తల మస్తకః
తస్య మధ్యే వహ్ని శిఖా అణీ యోర్ధ్వా వ్యవస్థితః॥
11 నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా
నీవార సూకవత్తన్వీ పీతాభా సత్యణూపమా॥
12 తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః
సబ్రహ్మసశివస్సహరిస్సేన్ద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్॥

## యోపాం పుష్పం

13 యోపాం పుష్పం వేద పుష్పవాన్ ప్రజావాన్
పశుమాన్ భవతి । చన్ద్రమావా అపాం పుష్పం
పుష్పవాన్ ప్రజావాన్ పశుమాన్ భవతి ।
య ఏవం వేద॥

14 యోపామాయతనం వేద ఆయతనవాన్ భవతి
అగ్నిర్వా అపా మాయతనం ఆయతనవాన్ భవతి
యోగ్నే రాయతనం వేద ఆయతనవాన్ భవతి
ఆపోవా అగ్నే రాయతనం ఆయతనవాన్ భవతి
య ఏవం వేద॥

15 యోపామాయతనం వేద ఆయతనవాన్ భవతి
వాయుర్వా అపా మాయతనం ఆయతనవాన్ భవతి
యోవాయో రాయతనం వేద ఆయతనవాన్ భవతి
ఆపోవై వాయో రాయతనం ఆయతనవాన్ భవతి
య ఏవం వేద॥

16 యోఽపామాయతనంవేద ఆయతనవాన్ భవతి
అసౌవై తపన్నపా మాయతనం ఆయతనవాన్ భవతి
యోఽముష్య తపత ఆయతనంవేద ఆయతనవాన్ భవతి
ఆపోవా ఆముష్య తపతఆయతనం ఆయతనవాన్ భవతి
య ఏవం వేద॥

17 యోఽపామాయతనంవేద ఆయతనవాన్ భవతి
చన్ద్రమావా అపామాయతనం ఆయతనవాన్ భవతి
యశ్చన్ద్రమస ఆయతనంవేద ఆయతనవాన్ భవతి
ఆపోవై చన్ద్రమస ఆయతనం ఆయతనవాన్ భవతి
య ఏవం వేద॥

18 యోఽపామాయతనంవేద ఆయతనవాన్ భవతి
నక్షత్రాణివా అపా మాయతనం ఆయతనవాన్ భవతి
యోనక్షత్రాణా మాయతనంవేద ఆయతనవాన్ భవతి
ఆపోవై నక్షత్రాణా మాయతనం ఆయతనవాన్ భవతి
య ఏవం వేద॥

19 యోఽపామాయతనంవేద ఆయతనవాన్ భవతి
పర్జన్యోవా అపా మాయతనం ఆయతనవాన్ భవతి
యః పర్జన్య స్యాయతనం వేద ఆయతనవాన్ భవతి
ఆపోవై పర్జన్య స్యాయతనం ఆయతనవాన్ భవతి
య ఏవం వేద॥

20 యోఽపామాయతనంవేద ఆయతనవాన్ భవతి
సంవత్సరోవా అపా మాయతనం ఆయతనవాన్ భవతి
యస్సంవత్సర స్యాయతన వేద ఆయతనవాన్ భవతి
ఆపోవై సంవత్సర స్యాయతనం ఆయతనవాన్ భవతి
య ఏవం వేద॥

21 యోఽప్సునావం ప్రతిష్ఠితాం వేద ప్రత్యేవ తిష్ఠతి॥

22 కిం తద్విష్ణోర్బల మాహుః కా దీప్తిః కిం పరాయణం
ఏకో యద్ధార యద్దేవః రేజసీ రోదసీ ఉభే॥

23 వాతా ద్విష్ణోర్బల మాహుః అక్షరాద్దీప్తి రుచ్యతే
త్రి పదాద్ధార యద్దేవః యద్విష్ణో రేక ముత్తమం॥

24 రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే నమో వయంవై
శ్రవణాయ కుర్మహే సమే కామాన్ కామ కామాయ
మహ్యం కామేశ్వరో వై శ్రవణో దదాతు కుబేరాయ
వై శ్రవణాయ మహారాజాయ నమః॥

25 ఓం తద్బ్రహ్మ ఓం తద్వాయుః ఓం తదాత్మా
ఓం తత్సత్యం ఓం తత్సర్వం ఓం తత్పురోం నమః॥

26 అన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు
త్వం యజ్ఞస్త్వం వషట్కారస్త్వ మిన్ద్రస్త్వగ్ం
రుద్రస్త్వం విష్ణుస్త్వం బ్రహ్మత్వం ప్రజాపతిః॥

27 త్వం తదాప ఆపోజ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భు
వస్సువరోమ్॥

28 ఈశాన స్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ
భూతానాం బ్రహ్మాధిపతిర్ బ్రహ్మణోధిపతిర్
బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్॥

ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః వాయీశం ప్రతిగచ్ఛతి॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః సువర్ణమంత్రపుష్పం సమర్పయామి॥

(హస్తమునయున్న పుష్పములు స్వామికి అర్పించాలి.)

## ఆత్మ ప్రదక్షిణము:

(3 సార్లు స్వామికి ప్రదక్షిణము చెయ్యాలి.)

యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే॥
పాపోఽహం పాపకర్మాఽహం పాపాత్మా పాపసంభవః
త్రాహిమాం కృపయాదేవ శరణాగతవత్సల॥
అన్యథా శరణంనాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్కారుణ్యభావేన రక్షసాయీ మహేశ్వర।
ప్రదక్షిణాత్రయందేవం ప్రయత్నేనమయాకృతం
దాసోహమితిమాం మత్వా షిర్డీవాస క్షమస్వమాం॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి॥

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః సాష్టాంగనమస్కారాన్ సమర్పయామి॥

(సాష్టాంగపడి నమస్కరించాలి.)

## ఉ ప చా ర ము లు :

ఛత్రం ఆచ్ఛాదయామి। చామరం వీజయామి। నాట్యం దర్శయామి। నృత్యం దర్శయామి। ఆందోళికానారోహయామి। అశ్వా నారోహయామి। గజా నారోహయామి। సమస్త దేవోప చారాన్ సమర్పయామి। సమస్త రాజోపచారాన్ సమర్ప యామి। సమస్త మనుష్యోపచారాన్ సమర్పయామి।

## అ ప రా ధ స్తో త్ర ము

ఆవాహనం నజానామి నజానామి తవార్చనం
పూజావిధిం నజానామి క్షమ్యతాం భక్తవత్సల॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం సాయీశ్వర
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥
అపరాధం సహస్రాణి క్రియతేఽహర్నిశంమయా
దాసోఽహమితిమాం మత్వా క్షమస్వ కరుణాసధే॥
యన్మయాభక్తియుక్తేన పత్రం పుష్పం ఫలం జలమ్
నివేదితం చ నైవేద్యం తద్గృహాణానుకమ్పయా॥
ఈప్సితంచ వరం దేహి పరత్రచ పరాంగతిం
రూపందేహి జయందేహి యశోదేహి ద్విషోజహి॥

విద్యాందేహి బలందేహి బుద్ధిందేహి మహోత్తమాం
పుత్రాన్ దేహి ధనందేహి సర్వాన్ కామాంశ్చ దేహిమే॥

దేహిశాంతిమవిచ్ఛిన్నాం సర్వత్ర తవదర్శనం
కామరాహిత్యజంచానేఽత్మానందస్థితిం స్థిరామ్॥

గతం పాపం గతందుఃఖం గతందారిద్ర్యమధ్యమే
ఆగతా సుఖసంపత్తిః పుణ్యాద్వై తవ దర్శనాత్॥

అనయాధ్యానాఽవాహనాది షోడశోపచార పూజాయాచ భగవాన్ సర్వాత్మకః శ్రీ షిర్డీ సాయినాథసుప్రీత సుప్రసన్నో వరదోభవతు॥

(ఉదకమును స్పృశింపవలయును.)

సర్వం శ్రీ షిర్డీశ్వరార్పణమస్తు॥

(ఉదకమును విడువవలయును.)

శ్రీ షిర్డీ సాయినాథప్రసాదం శిరసాగృహ్ణామి॥

(స్వామికి పూజించిన పుష్పము శిరస్సున ధరించాలి.)

## తీర్థగ్రహణము :

అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం సర్వ
పాపక్షయం దివ్యం "సాయీ" పాదోదకం పావనం శుభమ్॥

(అభిషేకతీర్థమును లోనికి తీసికొనవలయును.)

## ఉద్వాసనం:

(పుష్పాక్షతలు స్వామిపైన ఉంచి హస్తముతో పట్టుకొని)

మంత్ర:

యజ్ఞేనయజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమా న్యాసన్ తేహనాకం మహిమా నస్సచన్తే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః.

శ్రీ షిర్డీ సాయినాథాయ నమః యథాస్థాన ముద్వా సయామి॥

శ్రీ సాయినాథ ప్రతిమను ఉత్తరదిక్కునకు ఎత్తి కదల్చవలయును.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః





శ్రీ సాయి భక్తులకు-

## మనవి

ఇందు ప్రథమాధ్యాయమున వివరింపబడిన "పవిత్ర రహస్యగాథలును, శ్రీసాయీవ్రతమహిమయును" ఒకా నొక మహనీయదివ్యమూర్తి వలన సుస్వప్నరూపంబున విని, వారి యానతిననుసరించి, యీసాయీవ్రతమాహాత్మ్య మును కలితారకంబుగా నమ్మికానుసారంబు హృదయం బున జేర్చి, సాయిపూజ లాచరింపుచు పావనులై శ్రీ సాయిభగవానుని కృప నపేక్షింపగోరు సాయిభక్తుల కొఱ కుద్దేశించి వెల్లడించియున్నాను.

మిగిలిన అధ్యాయములందు తెల్పిన సాయి మాహాత్మ్యగాథలకు "హేమాత్పంతుచే" మహారాష్ట్రభాష యందు రచింపబడిన "సాయి సచ్చరిత్ర" ఆధారము.

-రచయిత





# శ్రీ సాయినాథ వ్రతమాహాత్మ్యము

## ప్రథమాధ్యాయము

ఒకానొక సమయంబున నైమిశారణ్యంబునందు రోమహర్షణపుత్రుండును ఉగ్రవసుం డనుపేర నొప్పు నిఖిలపురాణవ్యాఖ్యానగరిష్ఠుం డగు సూతుని, శుకశౌనకాది ఋషులెల్లరు పరివేష్టించి- యిట్లని ప్రశ్నించిరి.

"సూత! కేనప్రకారేణ కాలక్షేపో భవే న్నృణాం
ప్రారబ్ధే సతి పూర్వోక్తే విసేయుః కథమాస్తికాః
కథం కాలం కలౌనేయా మనుష్యాణాం సుదుర్లభః॥"

ఓ సూతా! కలియుగంబు యుగంబులలోనెల్ల దుస్తరంబు. కలి తారకంబగు మార్గ మెద్ది? పురాకృతశేషం బేరీతి హరించు? నిరంతర రోగపీడితులు, అల్పాయుష్కులు, నాస్తికులగు మానవు లెట్లు విద్యాయుర్ధనారోగ్యంబులు పొంది సుఖింపగలరు? కలిలో సత్యధర్మపరాయణులగు అల్పసంఖ్యాకజీవులకు ఎట్లు జయంబు చేకూరు? ఆస్తికత్వం బంతరించి, వర్ణాచారధర్మంబులు విడిచి, సురపాన గోమాంసభక్షణాది

దురాచారంబు లాశ్రయించి, పరస్పర మోసప్రియులగు మానవులు సతీ సుత సోదరీభేదంబుల పాటింపక, పశుతుల్యులై సంచరింతురని కదా వ్యాసభట్టారకుడు భవిష్యత్కాలగతి తెలిపియున్నాడు.

అట్టితటి మానవులకు సద్గతి కాధార మెద్ది? ఏదేవుని పూజించిన పురాకృతశేషం బేరీతి హరించు? మానవు లెట్లు సుఖంబులందగలరు? అనుప్రశ్నపరంపరలతో సూతుని ముంప-సూతుం డిట్లనియె.

ఓ ఋషిశ్రేష్ఠులారా! మీ రీనాడు నావలన తెలియ గోరినవిషయంబు, రహస్యాతిరహస్యంబు. ఈ మీ సంశయం బులకు చక్కని పూర్వగాథ యొండు గలదు- వినుండు.

రమ్యాతిరమ్యంబగు కైలాసశిఖరంబున పుణ్యదంపతు లగు పార్వతీపరమేశ్వరులు కొలువై యుండ, దేవదేవునిగూర్చి ఒకానొకసమయంబున- పార్వతి యిట్లని ప్రశ్నించె.

దేవా! సర్వశుభంకరా! శంకరా! జీవులు సర్వాభీష్ట సిద్ధి నొందుటకు సూక్ష్మమగు విధానం బెద్ది? సంసారము త్యజించి, అనిలభక్షణంబు చేయుచు కుక్షిని క్షోభపెట్టుచు, వాయువుల బంధించి, యోగమార్గంబున కృశించి నీ కృప నందుట, మానవలోకంబునకు దుర్లభంబు. అందును ఒక యుగముకంటె నొకయుగమున జీవులు అల్పాయుష్కులు, దుర్బలులు, భక్తిహీనులు, చిత్తస్థైర్యము లేనివారలు నగుదు

రని వింటి. అట్టివారి కెయ్యది తరణోపాయంబు? అని ప్రశ్నింప పరమదయానిధి యగు- శంకరుం డిట్లానతిచ్చె.

దేవీ! సావధానంబుగ వినుము. ఏయుగంబునందైనను, జగత్ప్రభువు భగవానుండు సర్వసమర్థుం డొక్కడే. ఆయన చిద్విలాసము ననుసరించి, జగంబులు, యుగంబులు, పలుతరగతుల దేవవర్గంబులును నిర్ణీతములై, ఆ సర్వాధికారి యాజ్ఞకులోనై సర్వము నిర్ణయబద్ధంబై నడచు. ఏనును, విష్ణుండును, బ్రహ్మయు స్వతంత్రులము గాము. ఏ దేవదేవుని మహిమచే మే మెల్లరము సృష్టింపబడి మనుచుంటిమో, అట్టి దేవాధిదేవుం డొక్కడు గలడు. ఆయన నిత్యానందస్వరూపుడు. శాంతమూర్తి. ప్రేమస్వరూపి. దయార్ద్రహృదయుడు. ఆ ప్రభువుకృప నొందగలిగినచో, సర్వసుఖసౌభాగ్యంబులు లభించునని తెల్పుచుండ,

పార్వతి ఆశ్చర్యచకితయై– నీకంటె జగత్ప్రభు వెవ్వరు? నిను మించిన దేవు డొక డున్నాడని తొలిసారి యీనాడు నీవలన వింటిని. దేవదేవా! ఆ మహాపురుషు డెవ్వరు? ఆయన నామం బెద్ది? నిలయం బెద్ది? ఆయన ఎట్టివాడు? అని అంతులేని ప్రశ్నపరంపరల ముంచగా- శివుం డిట్లనియె.

కళ్యాణీ! ఆయననే శ్రుతులు "శ్రీమన్నారాయణు" డని కీర్తించు. ఆయనయే ఆత్మమూలుడు. పరమేశ్వరుండు, సర్వజ్ఞుం డన నొప్పు. సర్వరూపంబు లాయన రూపంబులు.

ఆయన నిలయం బిది యది అని యీనాఁడు తెలుప నేరికిని తరముగాదు. ఆయన విలాసముచే యీకాలచక్రము తిరుగుచున్నది.

ఆ మహానీయుని "ఓం నమో సాయీశ" యని స్మరింపుచు కల్పోక్త విధానమున పూజించు జీవులు ఎట్టి భయంబును లేక, సర్వాభీష్టముల నొందుచు, అంతంబున సాయికృపచే సాయీసాన్నిధ్యము లభించి, నిరంతరానందసుఖంబుల నోలలాడగలరు. అని సెలవీయగా,

పర్వతరాజపుత్రి తత్పూజాక్రమంబు ఎఱుకపరచుమో దేవదేవా! యని కుతూహలాయత్త చిత్తంబున పునః పునః ప్రణామంబు లాచరించి వేడగా, దయానిధి యగు- కైలాస నిలయుం డిట్లని చెప్పదొడంగెను.

శ్రీ సాయీశునకు గురువారము ప్రీతియగు దినము, కాన గురుదినంబున యీవ్రత మాచరించుట ముఖ్యము. ఉదయ సాయంసమయములందుగాని, అం దొకవేళగాని, శ్రీ సాయీశ్వరుని పూజించుటకుగాను, స్వగృహోత్తరభాగంబున నొక పూజామండపంబు నిర్మించి, తోరణాదులచే సద్దాని నలంకరించి, రంగవల్లులు దీర్చి, శుచియై పూజా మండపంబు జేరి శ్రీ సాయిదేవుని ప్రతిమను అలంకరింపబడిన వేదికపై నిల్పి, పురుషసూక్త విధానమున గాని, కల్పోక్త విధానమున గాని ఎవరి కెట్లు హితవో అట్లు పూజింపవచ్చును. శుచి యన కేవలము స్నానాదికము లాచరించి శుభ్రవస్త్రముల ధరించుటయేగాదు.

మనమున ఎట్టి చెడ్డతలంపులు చేరనీక, దేవదేవు డగు శ్రీసాయి నాథునిపైన గురినిల్పి, పూజ గావించిన ప్రతివ్యక్తికిని శ్రీ సాయి ప్రభువు తప్పక ధర్మసమ్మతము లగు కోర్కెల నిచ్చి రక్షించును.

మరియు, కఠినవ్యాధిపీడితులు 7 గురుదినంబులును, సంతానాభిలాష గలవారు 14 గురుదినంబులును, పరీక్షల నుత్తీర్ణులు కాగోరువారు 5 గురుదినంబులును, పెండ్లి నపేక్షించు కన్యా వరులు 5 గురుదినంబులును, న్యాయస్థానమున జయాభిలాషులు 5 గురుదినంబులును, ఇక్కట్ల చిక్కువడిన దీనులు 7 గురుదినంబులును, పదవుల (ఉద్యోగప్రాప్తి) నందగోరువారు 21 గురుదినంబులును, వాణిజ్యాభివృద్ధినందగోరువారు 21 గురుదినంబులును, సదా సాయిదేవుని కృప నపేక్షింపగోరువారు నిత్యమును యీ వ్రత మొనరించినచో తప్పక తమ తమ అభీష్టసిద్ధి నొందగలరు.

యథాశక్తి "ఓం నమో శ్రీ సాయి" యను సాయి నామస్మరణము చేసి, రేయి భుక్తిసల్పక అల్పాహారముతో కుక్షి నింపి, వ్రతదీక్ష నెఱపుచు, సూర్యోదయము మొదలు మరు సూర్యోదయమువరకు నృత్యగీతవాద్యాదులతో సాయి నామ సంకీర్తన మొనరింపవలయును.

జాతి మత వివక్షతలు లేక ఆబాలగోపాలము, పురుషులు, స్త్రీలు, బాలురు, కన్యలు, విద్యార్థులు, సువాసినులు, పూర్వసువాసినులు అందరును యీవ్రతమును ఆచరింపవచ్చును.

ఆర్తత్రాణపరాయణుండు, భక్తులపాలిట కల్పవృక్షము, కోరికల నొసంగు కామధేనువు అనదగు శ్రీ సాయినాథుని విధ్యుక్తముగ పూజించువారలకు సర్వాభీష్టములు సిద్ధించును.

ఓ దేవీ! శ్రీ సాయినాథుని అనంతకళలలో ఒక్క కళయే జ్యోతిస్స్వరూపుండగు రవితేజంబని గ్రహించి, శ్రీ సాయి నాథుని అనంతమహిమంబు లూహించుకొమ్మని పరమేశ్వరుం డానతీయ, పార్వతి విని శ్రీ సాయివ్రతం బాచరించి, మాహాత్మ్యంబు స్మరించి, శ్రీ సాయీశు కృపచే శివుని మేన సగంబుగ నిలయంబయ్యె.

మరియు, గణపతి సాయిపూజ ఆచరించి, ప్రమథగణంబుల కధికారియు, విఘ్నంబుల కధిపతియు నయ్యె.

శ్రీరాము డీవ్రత మాచరించి, సీతను తిరిగి పొందగల్గె. రుక్మిణి యీవ్రతఘనతవలననే శ్రీకృష్ణుని పరిణయమాడె. శ్రీకృష్ణుం డీదేవదేవుని ప్రసాదంబువలననే జరాసంధుని జయింపగల్గె. దేవవర్గమునందలి ఏదేవుడు, ఏఅవతారధారి, ఏఘనత సంపాదించినను సాయిదేవుని కృపవలననే సంపాదించిరి.

ఇవ్విధముగ శంకరునిచే తెలుపబడిన సాయినాథవ్రత మాహాత్మ్యంబు, నేను నందీశ్వరునివలన వింటిని.

ఇంతియగాదు, శ్రీ సాయీశుడు దయార్ద్రహృదయుడు. ప్రేమస్వరూపుడు. కేవల స్మృతిమాత్రమున ప్రసన్నుడు. స్మరించినమాత్రమున సంతుష్టి జెందువాడు. కలియుగంబున దేవ మానవుల కాదేవదేవుండే గతి. సర్వదేవరూపంబులకు, అవతారంబులకు మూల మాయనయే. ఆ మహానుభావుడు మాయామర్దనుడు. "ఏకో నారాయణః అన సాయియే." ఆయన విలాసమే భిన్నరూపంబులగు దేవదేవులని మఱువరాదు. ఆయన

ఆనందముకొఱకు పలురూపులు, యుగంబులు నెఱపి, కలియుగాంతమునకు "ఏకో నారాయణో సాయి" అను రూపమును ధరించి, మానవ భిక్షుకరూపంబున, పావనగోదావరీతీరంబునం దవతరించి, సామాన్యమానవునివలె మెలంగుచు, సర్వసమర్థుండై, అనేక నియతులు మానవులకు బోధించి, సర్వజీవప్రేమతత్వసౌహార్దతలు ప్రకటింపుచు, దుఃఖాశ్రుపూరితులైన, సత్యధర్మపరాయణులగు మానవుల అనేకుల ఉద్ధరించి కతిపయవత్సరములు మానవులకు సహాయులై గడిపి, తదుపరి అసమాన తేజోబలసమన్వితుండై, జగద్వ్యాపకత్వంబు సల్పుచు, ఎడనెడ భక్తులకు క్షణికకాలము దర్శనం బొసగి వారల నాశ్చర్యనిమగ్నులుగ జేయుటయేగాక, కానరాకున్నను నమ్మిన భక్తులకు సర్వవేళల, సర్వావస్థల వెన్నంటి రక్షింపుచుండునని సూతుండు శ్రీ సాయినాథవ్రతమాహాత్మ్యంబు నెఱిగింప, ఋషులెల్లరు అమందానందాశ్చర్యచకితులై వినిరి.

శ్రీ సాయిదర్శన మపేక్షింప కుతూహలురై కొందరు ఋషులు కలియుగంబున మానవజన్మల నాశించి, యీ వ్రతంబు సల్పిరి. తద్వ్రతమహిమంబున వారు శ్రీ సాయీచరణసేవానిరతానందంబుకొఱకు, కలిలో మానవజన్మలకు వచ్చి, షిర్డీపురమందు వేంచేసియున్న శ్రీ సాయీశుని సాన్నిధ్యమునజేరి నిత్యదర్శనస్పర్శనాదులచేతను సేవించి, శ్రీ సాయీ కృపారసామృతమును గ్రోలి పావనులై, ఆయనయం దైక్యతను పొందినవారైరి.

అష్టాదశమహాపురాణంబులను, ఉపపురాణంబులను వ్రాసి, వేదముల చిక్కులు సడలించిన వేదవ్యాసుండు, తన పురాణము లలో శ్రీ సాయినాథమాహాత్మ్యంబును వర్ణింపని లోపముచే "కలిలో హేమాత్పంతు"గా మానవజన్మకువచ్చి, షిర్డీలో శ్రీ సాయీశుని సేవించి, వారి యనుమతితో మానవరూపం బున షిర్డీలో వెలసిన శ్రీ సాయిప్రభుని అద్భుతలీలావిశేషంబుల గోరిక్రీకరించి, "శ్రీ సాయి సచ్చరిత్ర"ను మహారాష్ట్రమున లిఖించి ధన్యుండయ్యె.

ఓం నమో శ్రీ సాయి, శ్రీ సాయీభక్తాః సుఖినోభవన్తు

ఇది ప్రథమాధ్యయము.

---

## ద్వితీయాధ్యయము.

కలిమానవు లెవ్వరైనను సాయీవ్రతం బొనర్చి అభీష్ట సిద్ధి నొందినవారున్న తెలుపుడని, సాయిభక్తు లెల్లరు సాయి సచ్చరిత్ర వ్రాయుటకై "హేమాత్పంతు" పేరిట అవతరించిన వ్యాసభట్టారకుని చేరి కోరగా హేమాత్పంతు ఇట్లని తెలుప జొచ్చె.

1909 సంవత్సరమున తొలిసారిగ భీమాజీపాటిల్ అను వానిచే యీవ్రత మాచరింపబడి, ఆయన పొందిన మేలును తెల్పుచున్నాను వినుడు.

పూనాజిల్లాయందలి జిన్నారు తాలూకాలో నారాయణ
ం అను గ్రామము కలదు. ఆగ్రామమున భీమాజీపాటిల్ అను
పన్నుం డుండెను. అతని కొక కఠినమగు ఛాతీజబ్బు అంకు
ది, ఎన్ని ఔషధములు వాడినను దినదినమునకును వ్యాధి
ఓ్కువై, మందుల లక్ష్యపెట్టక తుదకది భయంకరక్షయరూపంబు
ల్చె. రోగి కృశించి శల్యావశిష్టుండయ్యె. శరీరము వెచ్చ
క్కెను. శ్వాసకోశంబులు తమతమ పనులు సరిగ నెరవేర్పక
వుటచే ఆయాసము మెండయ్యె. ఆహారము హితవులేకుండె.
ర నయనములకు దూరమయ్యె. ఏవైద్యమువలనను ఉపయో
ము కానరాదయ్యె.

తుదకు భీమాజీదృష్టి భగవానునిపైకి మరలి నారాయణా!
కిప్పుడు నీవు తక్క సాయపడువారు లేరని భోరున ఏడ్వసా
ం. ఇట్లు ఏడ్వగా ఏడ్వగా అతని కొక ఆలోచన తట్టెను.

షిర్డీ సాయిబాబాకు మిగుల చనువుగల భక్తుడగు
"నానాసాహేబు చందోర్కరు" అను ఒక గొప్ప ఉద్యోగి
ప్యూటీ కలక్టరు) తో తన ఆరోగ్యమునుగూర్చి సలహా
డువలెనని తట్టెను. వెంటనే ఆయన తన రోగలక్షణములు
ప్పుచు నొక జాబువ్రాసి ఆయన సలహాకోరెను. అందుకు
"నా" వెంటనే సమాధానమిచ్చెను.

ఈవ్యాధి నివారణకు ఒక్కటేమార్గ మనియు, అది
సాయిబాబా చరణములపై వ్రాలి సర్వస్వశరణాగతి వేడుకొ
ుయే, రోగమునుండి రక్షింపబడుటకు మార్గంబని తెల్పెను.

భీమాజీ, నానాసాహెబ్ తెలిపిన హితోపదేశము శిర సావహించి, షిర్డీకి ప్రయాణమై బంధుమిత్రులసాయముచే శ్రీ సాయిబాబావారి పాదములపై వ్రాలెను. ఆ సమయ మున కచ్చట బాబాకు మిగుల కూర్చు భక్తుడగు శ్యామా గూడ యుండుట తటస్థించెను. కాని భీమాజీ గతజన్మలోని పాపఫలముతో జోక్యము కలుగజేసుకొనుటకు బాబావారు ఇష్ట పడకుండిరి. రోగిమాత్రము దృఢమగు పట్టుదలతో సాయీశుని చరణకమలములు విడువక "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అని దీనముగ సాయిప్రభుని వేడసాగెను.

కరుణాసాగరుం డనదగు సాయి హృదయము కరగెను. దీనజనరక్షణ బిరుదాంకితుడగు ఆ మహనీయుడు తన అభయ హస్తమెత్తి "ఆగుము! నీ ఆశ్రిత పారద్రోలుము. నీకష్ట ములు గట్టెక్కినవి. ఈ మసీదు మెట్లు నెక్కినవారి కష్ట ములు వెంటనే నిష్క్రమించి, ఆనందమునకు మార్గము దొర కును. ఇచ్చట ఫకీరు (తాను) మిగుల దయార్ద్రహృదయుడు, రోగమును బాగుచేతురు. భయము వీడు" మని ప్రేమామృత వాక్కులతో ఆ దయాసాగరు డాదీనుని కటాక్షించెను.

ఆతడు అంతకుమున్ను ప్రతి అయిదునిమిషముల కొక పర్యాయము రక్తమును వాంతిచేసుకొనుచుండెను. కాని శ్రీ సాయీశు డీవరంబులు పల్కిన క్షణమునుండి మరి వాంతి చేయలేదు. రోగము మళ్ళనారంభించెను. అతనిని ఆయూర భీమాభాయి ఇంట నిలువుమని బాబా ఆజ్ఞాపించెను.

తావు సౌఖ్యకరమైనదియు, ఆరోగ్యకరమైనదియు కాకు
ను బాబా ఆజ్ఞ నొదల దాల్చి అందు రోగి విడిసెను.

కొలది దినము లట్లు గడువగా భీమాజీ రెండు స్వప్నం
ల పొందెను. మొదటిస్వప్నమున తానొక విద్యార్థిగనుండి
ద్యములు కంఠస్థము చేయనందులకు గురువు తనను శిక్షించి
ట్లును, రెండవస్వప్నమున వాని ఛాతీపై పెద్దబండ నిడి
ర్లించుటచే అమితమగు బాధ ననుభవించినట్లు కలగాంచెను.
నితో వాని పురాకృతపాపకర్మ నిశ్శేషమయ్యె. రోగము
డసశ్శేషమై, ఆరోగ్యముచేకూరి స్వగృహమునకు మరలెను.

ఆతడు నిత్యమును బాబా చరణసరోజములకు మాన
ముగ సాష్టాంగనమస్కారముల జేయుచు, బాబావారి మేలు
రువక, ప్రతివారమున, ప్రతిపక్షమున, ప్రతిమాసమున ఆవరకు
హారాష్ట్రదేశమందలి ఆచారప్రకారము తాజేయు సత్యనారా
ణ వ్రతమునకు మారుగ "శ్రీసాయీ సత్యవ్రత" మను పేరిట
రాక్రొత్తపూజను భక్తిశ్రద్ధలతో ఆచరించుచు శ్రీసాయినాథుని
నుగ్రహమునకు పాత్రుండై తన జీవితశేషమును గడిపెను.

కావున కఠినవ్యాధి పీడితులు శ్రీసాయినాథ వ్రతమును
న్యుక్తముగ సల్పి, నిరంతరారోగ్యమును, సర్వశ్రేయో సుఖం
లను పొందెదరుగాక యని సాయిభక్తుల నుద్దేశించి యీవ్రత
ాహాత్మ్యము హేమాత్పంతుచే వివరింపబడియె.

ఓం నమో శ్రీసాయి, శ్రీ సాయీభక్తాః సుఖినోభవన్తు

ఇది ద్వితీయాధ్యాయము.

# తృతీయాధ్యాయము.



శ్రీ సాయినాథమాహాత్మ్యంబు విన కుతూహలురై పరివేష్టించియున్న సాయిభక్తుల నుద్దేశించి, శ్రీసాయిబాబాను పూజించి, బాబా కృపచే సంతానాభివృద్ధిని వడసిన యథార్థ గాథను హేమాత్పంతు రూపధారియగు వ్యాసభట్టారకుం డిట్లని చెప్పదొడంగె.

షోలాపూర్ నివాసియైన సఖారామ్ ఔరంగబాద్కర్ భార్య కాపురమునకు వచ్చి 27 సంవత్సరములయినను వారికి సంతానభాగ్యము లేకపోయె. ఆమె అనేకమంది దేవతలకు మొ్రెక్కలిడెను. కాని ప్రయోజనము కన్పింపదయ్యె. ఆ తన్వంగి నిరాశజెంది తుదిప్రయత్నముగ శ్రీ షిర్డీశ్వరుని సేవించవలెనని నిర్ణయించుకొనెను. తన సవతి కొడుకగు విశ్వనాథునితో షిర్డీ చేరి రెండుమాసములు శ్రీ సాయిభగవానుని కడు నమ్మికతో సేవించెను. ఆమె వారి పాదములపై బడి తన కోరిక తెలుపుకొందమన్న, ఆయన సదా భక్తబృందముచే పరివేష్టింపబడి యుండెడివారు. అందుచే

బాబాతో మిగుల చనువుగ మెలగెడి శ్యామ యను భక్తుని ఆశ్రయించి, ఆయనద్వారా శ్రీ సాయీశుని అనుగ్రహము పొందు సుసమయమునకు, టెంకాయ ఊదువత్తుల గొని వేచియుండెను. ఒకానొకసమయంబున శ్యామా ఆనతి ననుసరించి, సాయీశుని చరణంబులవ్రాలి మ్రొక్కి వేడ దయా

మయుండగు ఆదేవదేవుడు ఆమెకు సంతానముకలుగునని వరం బిచ్చె.

ఆ వరప్రసాదముచే ఆమె కొక సంవత్సరములో సంతాన ప్రాప్తి కల్గి, ఆమె యీప్సితము సిద్ధించి అమందానందంబు నంది ప్రతి గురుదినంబునను శ్రీ సాయీవ్రతం బాచరింపుచు, శ్రీసాయి దేవుని అనుగ్రహంబునకు మరి మరి పాత్రురా లయ్యెను.

కావున, ఓ సాయిభక్తులారా ! సంతానాపేక్ష గలవారు శ్రీసాయీశుని సేవించిన నిస్సంశయముగ సంతతి నొందగలరు. ఇయ్యది అనేకభక్తులకు ప్రత్యక్షానుభవమగు సత్యము.

ఓం నమో శ్రీ సాయి, శ్రీ సాయీభక్తాః సుఖినోభవన్తు

ఇది తృతీయాధ్యాయము.

---

## చతుర్థాధ్యాయము

శ్రీ సాయి సచ్చరిత్రను వ్రాయుటకై హేమాత్పంతు పేరిట అవతరించిన వ్యాసభట్టారకుండు సాయిభక్తుల నుద్దేశించి, న్యాయస్థానమున జయాభిలాష గోరి సాయీవ్రత మాచరించి విజయలక్ష్మిని చేపట్టిన విచిత్రసంఘటనను గూర్చి యిట్లని చెప్ప దొడంగె.

ఒకానొక సమయంబున షిర్డీలో రఘు అను నొక యువకుని పైనను, వాని సహచరులగు మరి అయిదుగురిపైనను

ఒకస్త్రీని మానభంగము చేసిరను నేర మారోపింపబడి బలవత్తర సాక్ష్యముతో రుజువుకాబడుటచే 6 మాసములు కఠినశిక్ష విధింపబడెను. కాని నిందితులు పాపము నిరపరాధులు. ఈపరి స్థితిని పూర్తిగ ఎఱింగిన తాత్యాపశేలు (బాబాకు కూర్చు భక్తుడు) ద్వారకమాయియందు భక్తజనులతో పరివేష్టించి యున్న సాయీశ్వరుని చేరి ఆ నిరపరాధుల రక్షింపవలయు నని అతి ప్రాధేయముగ ప్రార్థించెను.

ఆసమయమున సాయిదర్శనాభిలాషతో అచ్చటనున్న సాయిభక్తులును, సుప్రసిద్ధన్యాయవాదులునగు గౌ॥ బి. యస్. కపర్దెగారును, హెచ్. యస్. దీక్షిత్ గారును, మేజస్ట్రేటు పదవుల నిర్వర్తించిన రావుబహద్దర్ సదే గారును, నిందితులపై వ్రాయబడిన శిక్షాపత్రములను పరిశీలించి, ఆ పత్రములు కడు నేర్పుతో వ్రాయబడి యున్నవనియు, అపీలు చేయుటవల్ల లాభము లేదనియు తమ తమ యభిప్రాయంబుల వెల్లడించిరి.

కాని తాత్యాపశేలు సాయి పాదారవిందములపై మోకరిలపడి రక్షింపక తప్పదని దీనముగ వేడసాగె. దయార్ద్ర హృదయుండగు షిర్డీశ్వరుడు తన హస్తమెత్తి అభయమిచ్చెను.

"నిందితులు విడుదలగుదురు. నీవు పోయి భావుతో (రావుబహద్దర్ దుమాల్, అడ్వకేటు-నాసిక్) అపీలు వ్రాయ మని, నేను చెప్పితినని చెప్పు"మని ఆజ్ఞాపించెను.

వెంటనే తాత్యా నాసిక్‌కు బయల్దేరి భావును కల్సుకొని విషయము నివేదించెను. శిక్షాపత్రములను తిలకించిన భావు ఇది

నిష్ప్రయోజన మగు కార్యమని మనమున శంకించియు, బాబా ఆజ్ఞ అనుల్లంఘనీయం బగుటచే వల్లెయని తనకు తోచినరీతి అపీలు వ్రాసి స్వయముగా జిల్లాకలెక్టరుకు సమర్పించెను.

కలక్టరు భావుతో నిందితులకు సరియైన ఆధారమెద్దియు కన్పింపదే. అట్టితరి వారిని విడిచిపెట్టు టెట్లు? అని ప్రశ్నింప వెంటనే భావు ఆయూరియందు పార్టీలున్నవనియు, పార్టీ వైషమ్యములవలన కేసు యీనిందితులపై బనాయించబడెననియు వాక్రుచ్చెను.

అందులకు కలక్టరు నిజమా? నీకు స్వయముగ తెలియునా? యని ప్రశ్నింప, బాబాపై భారమువైచి ధైర్యముతో ఔనని భావు సమాధాన మిచ్చెను.

వెంటనే కలక్టరు మారువిచారణ లేకయే, ఆకాగితములపై నిందితులు నిరపరాధులని తీర్పుయిచ్చి ఖైదీలను విడుదల చేయ ఉత్తరువుచేసెను.

ఈ విచిత్రసంఘటనకు తనలో తాను ఆశ్చర్యసంభ్రమములనోలలాడుచున్న భావుతో మీా షిర్డీ సాయిబాబా బాగా ఉన్నారా? ఆయన హిందువా? ముసల్మానా? ఆయన నీ కేమని హితోపదేశము చేసెను? అని కలక్టరు ప్రశ్నించుట భావుకు మరింత విస్మయము కల్గించెను.

అందులకు, సాయి హిందువుగాని, ముసల్మానుగాని కాదు. వారు సర్వసములు. వారి హితబోధలను వర్ణింప నాతరముగాదు. ఒకపరి తాము స్వయముగ వారిని దర్శింపవలయునని

వేడుకొనెను. అందులకు వల్లెయని చిరునవ్వుతో కలక్టరు భావును సాగనంపెను.

భావు తక్షణమే షిర్డీ చేరి సాయీశ్వరునికి యీవిషయ మంతయు నెఱింగింప, అచ్చటనున్న న్యాయశాస్త్రదక్షు లగు దీక్షిత్, కపర్దె ప్రభృతులు ఆశ్చర్య విస్మయ సంభ్రమముల ప్రదర్శించిరి.

కావున, ఓ సాయీభక్తులారా! న్యాయస్థానమున జయాభిలాష గోరి శ్రీ సాయీశు సేవించినవారికి, సాయి తప్పక ధర్మసమ్మతము లగు కోరిక లీడేర్చు ననువిషయము నిస్సంశయము.

ఓం నమో శ్రీ సాయి! శ్రీ సాయిభక్తాః సుఖినో భవన్తు

ఇది చతుర్థాధ్యాయము.

---

## పంచమాధ్యాయము.

శ్రీ సాయిభక్తు లెల్లరు పరివేష్టించియుండ, హేమాత్పంతు రూపధారియగు వ్యాసభట్టారకుండు, బాబా తన భక్తుల కెట్లు ఆర్థిక జీవనరంగములో సహాయపడుచుండెనో వివరింపనెంచి, శ్రీ సాయిమాహాత్మ్యమును స్వానుభవమున గుర్తించి, ఇహసుఖముల నోలలాడుచున్న "దాము అన్నా"ను గూర్చి ఇట్లని చెప్పదొడంగె.

దామోదరరాస్నె (దాము అన్నా) బాబాకు కూర్చు భక్తులలో ఒకడు. ఆత డేపని చేయనెంచినను బాబావారి అను మతి పొందనిది చేయడు. ఆతనికి వ్యాపారముచేసి విశేషధన మార్జింప కుతూహలము కలిగెను. తోడి మిత్రులు ధాన్యపు వ్యాపారము యీసమయములో మంచి లాభకరమైన దనియు, తప్పక చేయుమనియు ప్రోత్సహించిరి.

దామోదరుడు షిర్డీకి వచ్చి, శ్రీ సాయిని సేవించి ధాన్యపువ్యాపారము చేయనెంచితిననియు, ఆశీర్వదింపుమనియు ప్రార్థించెను. తన భక్తుల యోగక్షేమములు తనవిగా గుర్తించ గలిగిన బాబా వెంటనే ఇట్లని చెప్పెను.

"కంగారువద్దు. ఏపనినైనను చేయుటకు ముందు నిదానము కలిగియుండవలెను. పూర్వజన్మసుకృతముకొలది, ఎవరి కెంత ప్రాప్తమో వారి కది ఎచ్చటనున్నను లభించుచునేయుండును. ఈసమయంలో ధాన్యపువ్యాపారం లాభకారికాదు. త్వరలోనే ధరలు ఆకస్మికముగ పడిపోవును. ఇప్పుడు వ్యాపారం ఆరంభింతు వేని తీవ్రనష్టమునకు గురియగుదువు గాన ఊరుకొ"మ్మని వారించెను.

బాబాయే తన సర్వస్వమనియు, తన నిత్యజీవితనడక బాబావారి ఆశీర్వచనబలముపై సుఖముగ సాగుననియు దృఢ విశ్వాసముగలదామోదరుడు, బాబావారి ఆజ్ఞప్రకారంధాన్యపు వ్యాపారము చేయుసంకల్పము విరమించుకొనెను. తన తోడి

మిత్రులగు వర్తకులు ఏల నీసంకల్పము విరమించితివని ప్రశ్నించిరి. శ్రీ బాబావారు అంగీకరింపలేదనియు, ధాన్యపువర్తకమున కొలదిదినములలో ఆకస్మికముగ ధరలుపడిపోవునని తెల్పిరనియు, అందులకు తా నావ్యాపారము చేయ ధైర్యము లేదనియు తెల్పెను.

ఇందుకు తోడివర్తకు లందరు దామోదరుని పరిహాసించిరి. దినదినంబునకు ధాన్యంధరలు విపరీతముగ పెరుగుచున్నవి. ఇప్పట్లో యీవ్యాపారస్తులకు నష్టము కల్గుననువిషయము అబద్ధము. ఇట్టితరి మీ బాబా జ్యోతిషము ఏమిచేయుచున్నదని నవ్విరి. కాని బాబామాటలపై సంపూర్ణవిశ్వాసముగల దాము అన్నా చలించలేదు. ఎవరి నమ్మకము వారిది. నిజము నిలకడపై మీకే తెలియునులెండని ఊరకుండెను.

అనతికాలముననే సకాలవర్షములవల్ల పుష్కలముగ పంట పండి దిగుమతి అగుటచే ఆకస్మికముగ వర్తకులందరు విపరీతనష్టములకు గురికాబడిరి, దామోదరుడు శ్రీసాయి కృప వలన ఇట్టి ప్రమాదమునకు గురికాకుండ తప్పించుకొనగల్గెను.

శ్రీ సాయిభగవానుడు తన్ను కాపాడినందులకు మిక్కిలి సంతసించెను. తదుపరి షిర్డీవెళ్ళి శ్రీ సాయీశ్వరుని పూజించి, బొంబాయిలో దూది వ్యాపారము చేయనెంచితి ననియు, తన వ్యాపారలాభమున భాగమును స్వీకరింపుమనియు వేడుకొనెను,

సర్వవ్యాపకుడు, సర్వరక్షకు డగు సాయిభగవానుని ప్రాపంచికవ్యాపారసంబంధమున లాభనష్టములలో భాగమును కొనుమని ప్రార్థించు దామోదరు డెట్టి వెర్రివాడు!

అందుకు, బాబా "నాయనా! నేను సంసారిని కాను. నా కేల యీలౌకికబాధలు" అని చిరునవ్వు నవ్వెను.

తదుపరి, బాబావారి కృపవలన దామోదరునికి వ్యాపారాభివృద్ధి కలిగి ఇహలోకసుఖభోగవృద్ధి నొందినవాడై ప్రతి దినమునను శ్రీ సాయీవ్రత మాచరించుచు తన జీవితాంత్యమును విశేషసుఖభోగములతో సాగించుచున్నాడు.

కావున ఓభక్తులారా! సాయీశ్వరుడు దయార్ద్రహృదయుడు. నమ్మి సేవించు భక్తుల వెన్నంటి కాపాడు సద్భక్తసహాయి. ఎవ్వరయితే సర్వభారములు శ్రీ సాయి చరణారవిందములపై బడవైచి, నిత్యము సాయీధ్యానతత్పరులై మనుచుందురో అట్టివారిని సాయిప్రభువు సర్వవేళల అప్రమత్తుడై కాపాడుచుండును. ఇయ్యది వేలాదిభక్తులకు నిత్యము ప్రత్యక్షానుభవమగు సత్యము.

ఓం నమో శ్రీ సాయి, శ్రీసాయిభక్తాః సుఖినోభవంతు.

ఇది పంచమాధ్యాయము.

---

# షష్ఠాధ్యాయము.



శ్రీ సాయిపై భారమిడి విద్యాభ్యాసము సాగించు విద్యార్థులకు అపజయము కలుగదని నిరూపించు యీ క్రింది ఆఖ్యానము హేమాత్పంతు సాయిభక్తులకు తెలుపదొడంగెను.

శివదేవ్ అను నాతడు శ్రీబాబావారి భక్తుడు. 1903 సం॥న 'లా' పరీక్షకు చదువుచుండెను. విద్యాధికుడయ్యును భక్తి కలవాడు. పరీక్షలకు ముందు అనారోగ్యము చెందెను. అందు వలన చదువు సాగుటలేదు. పరీక్షలలో నెగ్గజాలనని అధైర్యము కలిగెను. పరీక్షకు బొంబాయిపోవుటకు ముందు షిర్డీ వచ్చి బాబాను దర్శించెను.

తోడనే బాబా "బిడ్డా! భయమేల? నన్ను స్మరించి పరీక్షాపత్రములకు సమాధానములు వ్రాయుము. నేనుంటిని గదా! తప్పక కృతార్థుడవు కాగలవు. పొమ్ము" అని ఆశీర్వదించి అభయ మిచ్చెను.

నిస్సంశయముగ సమర్థించుటకు సాయి సహాయము కల దను దృఢవిశ్వాసముతో బాబాను స్మరించుచు పరీక్షకు హాజరు అయి తోచినవిధముగ పరీక్షాపత్రములకు సమాధానములు వ్రాసెను. తప్పొప్పులతో ఆతనికి పనిలేదు. బాబావారి వాక్కు వృథా కానేరదనియే ఆతని నమ్మిక.

పరీక్షలైనవి. మిత్రులందరు ఒక్కచో చేరిరి. అందు అక్కల్‌కోట వాస్తవ్యుడగు "సపత్నీకర్" కూడ ఉండెను.

శివదేవ్ వ్రాసిన సమాధానములు ఒక్కటియైనను సరియైనవి కావు. ఆతడు పరీక్ష తప్పుట నిశ్చయమని తీర్మానించిరి.

శివదేవ్ మాత్రము చలింపక, శ్రీసాయిభగవానుని వాక్కు వృథాకానేరదు. నే వ్రాసినను, వ్రాయకున్నను సాయి దేవుని అమోఘ ఆశీర్వచనమే నన్ను పరీక్షయందు కృతార్థుని చేయునని వాదింప మొదలిడెను.

నీవు వ్రాయకున్న "నీ సాయిమాత్ర మేమిచేయగలడు ? హోరుగాలిలో దీపమిడి, దేవా ! నీమాహాత్మ్య మనుకొనుట వెర్రితనముగాదా ? అని సహపాఠకరు వెక్కిరించి హేళనచేసెను. అందులకు శివదేవ్ "తెలియని మూర్ఖులకు తెలియజెప్ప జూచు నేను నిశ్చయముగ వెర్రివాడనే యగుదును. నీవంటివారికి సత్పురుషులశక్తి తెలియు టెట్లు ? పరీక్షా ఫలితములు వచ్చిన పిదప ఎరుంగుదువులే" యని శివదేవ్ మిన్నకుండెను.

ఫలితములు ప్రకటింపబడినవి. రూఢిగా తప్పునని తీర్మానింపబడిన శివదేవ్ ఉత్తీర్ణుడయ్యెను,

కావున, ఓ సాయిభక్తులారా ! ఆ భగవానుని కృప నందగల్గినచో అసాధ్యమనునది ఎందును లేదు. శ్రీసాయివ్రత దీక్షాపరులై మీామీా అభీష్టసిద్ధి పొందుడని తెల్పిన హేమాత్పంతుకు సాయిభక్తు లెల్లరు విస్మయానందములతో నమస్కరించిరి.

ఓం నమో శ్రీ సాయి, శ్రీ సాయిభక్తాః సుఖినోభవన్తు

ఇది షష్ఠాధ్యాయము.

# సప్తమాధ్యాయము

-o*o- -o*o-

శ్రీ సాయినాథవ్రత మాచరించి అభీష్టసిద్ధి నొందిన కన్యావరుల ఉదంతము నెఱుంగగోరిన సాయిభక్తుల నుద్దేశించి హేమాత్పంతు రూపధారియగు వ్యాసభట్టారకుండు ఇట్లని తెలుపజొచ్చె.

గణేశ్ శ్రీయాన్ శ్రీసాయిభక్తులలో ముఖ్యుడు. తన సర్వ భారములు సాయిపై నిడి నిశ్చలభక్తితో శ్రీసాయీశుని పూజిం పుచు తన దైనందిన జీవితమును ప్రశాంతముగ గడుపుచుండెడి వాడు.

యుక్తవయస్కురాలగు తన కుమార్తెకు వివాహము చేయనెంచి ఒక అనుకూల స్థితిగతులు గల్గిన సంబంధమును వెదకి స్థిరపరచుకొన నిశ్చయించెను. ఆ పిల్లవాని తండ్రి తన కుమారుని విద్యాభ్యాసము 2 సంవత్సరములలో పూర్తియగు ననియు, అంతదనుక వివాహయత్నము వాయిదా వేయవలసి యున్నదనియు, విద్యాభ్యాసము పూర్తి కాగానే మాటప్రకారం తప్పక నీకన్యనే వివాహము చేతుననియు వాక్రుచ్చెను. శ్రీయాన్ గూడ అందులకంగీకరించి కట్నకానుకలన్నియు నిర్దుష్ట ముగ నిర్ణయించుకొనెను.

గడువుకాలము పూర్తియైనది. వరుని విద్యాభ్యాసము గూడ పూర్తియైనది. ఈపుత్రవానికి వివాహము లోగడనే నిశ్చయమైనదని తెలిసియు, విద్యాధికుడును, గుణరూపసుందరు

డును అగుటచే హెచ్చుకట్నములతో తమ కన్యల నిత్తుమని ధనాఢ్యులగు కొందరు రాయబారములు సాగించిరి. వరుని తండ్రి దురాశాపరుడు. లోగడ శ్రీయానతో తాను చేసికొనిన ఖరారును త్రోసిపుచ్చి హెచ్చుధనము చేకూరునను దురాశతో అన్యసంబంధమును నిశ్చయింపబూని మరియొక సంబంధమునకు మంతనములు సాగింప నారంభించెను.

ఈవిషయము శ్రీయాన్ చెవుల పడినది. ఇంతకాలము నుండి మంచి సంబంధము దొరకిన దనుకొనుచు తనకుమార్తె అదృష్టమునుగూర్చి ఉల్లాసపడుచున్న శ్రీయాన్ యావార్త వినగానే పిడుగువలె కూలబడెను.

ఏమిచేయుటకును కర్తవ్యము నెరుంగలేక సర్వసమర్థుం డగు సాయి తప్పక సహాయపడు నను ఆశతో ద్వారకమాయి యందున్న శ్రీసాయీశుని చేరి అశ్రుపూరితనయనములతో సాయి పాదములపై బడి తన ఆపత్తు నెరిగించెను.

భక్తరక్షణపరతంత్రుడగు సాయి తన ప్రేమామృత వాక్కులతో "నేనుండ నీ కేల భయము ? నీకేమియు ఆదుర్దా వలదు ! ఆపిల్లవానినే రెండుసంవత్సరములలోపుగ నీకు అల్లునిగ చేతు ! సందేహముపీడు" మని అభయమిచ్చెను. సాయినాథుని అద్భుతమహిమాన్విత శక్తుల నెరింగియున్న శ్రీయాన్ హృద యము తేలిక అయ్యెను. సాయిదేవుని వాక్కు తిరుగులేనిదను దృఢవిశ్వాసముగలవాడై యింటికి మరలెను. ప్రతిగురుదినంబు నను కుమార్తెతో సహా విధ్యుక్తముగ శ్రీ సాయివ్రతం బాచ

ంపుచు అనవరతము శ్రీ సాయీధ్యాన నిమగ్నులై కాలము గడుపసాగిరి. ఇటుల కొంతకాలము గతించెను. వారిపూజ ఫలించుకాలము గూడ సమీపించెను.

పిల్లవాని తండ్రి చేయుప్రయత్నము లొక్కటియు ఫలింపక విఘ్నపరంపరలు ఏర్పడుచుండెను. అంతరంగమున శ్రీసాయీశుని ప్రేరణముచే ఆవిద్యావంతు డగు పిల్లవాని మానసమున శ్రీయాన్ కుమార్తెనే వివాహమాడవలయునను కోరిక ప్రబలమయ్యెను. కేవలము ధనాశతో చేసినవాగ్దానము త్రోసి పుచ్చుట అన్యాయమని తండ్రికి బోధించి వాని మనస్సునుగూడ మార్పగలెను.

ఆపిల్లవాని తండ్రి తుదకు మొదట తాను శ్రీయాన్‌తో చేసికొనిన ఖరారుప్రకారము శ్రీయాన్ కుమార్తెతో తనకుమారునికి మహావైభవముగ వివాహము జరిపించెను.

కావున, ఓ సాయిభక్తులారా! ఆనాడేగాదు యీనాడుగూడ తమ బిడ్డల వివాహసంబంధములు చేకూర్చుటలో సాయిప్రభు వెట్లు సహాయపడుచుండెనో, శ్రీసాయీశ్వరుని పూజింపుచు భారము సాయి పై నిడి మనుచున్న సాయిభక్తులందరకును ప్రత్యక్షానుభవమగు సత్యమేయని హేమాత్పంతుచే సాయీవ్రతమాహాత్మ్యంబున ఎరింగింపబడియె.

ఓం నమో శ్రీసాయి, శ్రీ సాయిభక్తాః సుఖినోభవంతు.

ఇ ది స ప్త మా ధ్యా య ము.

# అష్టమాధ్యయము.



కలిలో ఇక్కట్లకు చిక్కి శ్రీసాయి కృపచే కష్టములబాసి సుఖించినవారి గాథ నెరింగింపవేయని హేమాత్పంతు రూప ధారియగు వ్యాసభట్టారకుని ప్రశ్నించు సాయి భక్తుల నుద్దేశించి హేమాత్పంతు ఇట్లని చెప్పదొడంగెను.

సర్వశుభంకరుడగు శ్రీసాయీశుడు భక్తబృందముతో పరివేష్టించి ద్వారకమాయిని సుఖాసీనుండై యుండ గోవా నుండి ఇరువురు భక్తు లరుదెంచి బాబాకు ప్రణమిల్లి అం దాసీనులైరి.

ఆ యిరువురలో నొకని నుద్దేశించి బాబా తనకు 15 రూకలు దక్షిణ నిమ్మనె. వెంటనే ఆత డద్దానిని శ్రీ సాయీశుని చరణములకడ నర్పించె. రెండవయాతడు కోరకపోయినను రు 35 లు సాయికి అర్పించి అద్దాని నంగీకరింపుమని వేడుకొనెను. కాని బాబా ఆరొక్కమును ముట్ట నిరాకరించెను.

ఈ విచిత్రసంఘటనము గమనించుచున్న శ్యామా యను ప్రియభక్తుడు చనువుచే "ఏమిది? బాబా! ఆతని చిన్నబుచ్చితి" రనెను.

అందుకు బాబా యిట్లనెను. "ధనము ప్రోగుచేసి భద్ర పరచుటకు నా కిల్లు వాకిలిగాని, సంసారముగాని లేదు భిక్షాటనచేయుచు మసీదున నివసించు న న్నొక ధనాశాపరునిగ

తలచుచున్నావా ? ఇన్నినాళ్లు నావెంటనుండి నన్నర్థముచేసి కొనలేదు.

వినుము, ఈ మసీదుమాయికి రావలసిన ఋణము ఖచ్చితముగ గద్దించి తీసుకొనును. ఇచ్చువాడు తన ఋణము నుండి విముక్తు డగుచున్నాడు.

ఈత డొకప్పుడు కడుపేద. దేశద్రిమ్మరి. ఎందైన ఉద్యోగము దొరకిన మొదటి నెలజీతము నాకిత్తునని మ్రొక్కుకొనెను. ఉద్యోగము దొరకె. నెలకు 15 రూకలు వేతనమున చేరి యీనాడు 700 రూకల జీతమును ఆర్జించుచున్నాడు. కాని నా కీయవలసిన ఋణము మొదటి నెల జీతము 15 రూకలే కావున అడిగి తీసికొంటిని.

ఇక రెండువయాతడు నాకు బాకీలేడు. వాని ధనముతో నాకు పనిలేదు." అనిచెప్పి కొంతసేపు మిన్నకుండి ఇట్లని చెప్ప నారంభించెను.

"ఒకప్పుడు నేను చల్లగాలికొరకు సముద్రప్రాంతమున సంచరింపుచు ఒక సుందరభవనము చూచి అందుబోవ, యజమాని స్వాగతమిచ్చి ఆతిథ్య మొసగి గదిలో బీరువాదరి విశ్రమించుటకు తావొసగి, నేను మైమరచి నిద్రింపగా వాని కేమి దుర్బుద్ధిపుట్టెనో నా అంగరఖానుండి ముప్పదివేల రూకల నపహరించెను.

ఉదయమున లేచి నా ధనము పోయినదని తెలుసుకొని, కష్టించి కూడబెట్టిన ధనము అంతయు ఒక్కమారు చోరులకు

చిక్కనందులకు పరితాపపడి, మతిభ్రమజెంది ఎట్లు జీవయాత్ర సాగింపవలెనా యని చింతించుచు ఆఇంటి అరుగుపై తిరుగాడు చుండ, నొక ఫకీరు కనిపించి ఒక మంచిసలహా నిచ్చెను.

"భయములేదు. నే చెప్పినట్లు చేయుము. దయార్ద్ర హృదయు డగు ఒకానొక ఫకీరుబాబు కలరు. వారి తావు తెలిపెదను. వారి దర్శనముచేసి వారి నాశ్రయింపుము. అంతవరకు వారిని హృదయమున ప్రార్థించుచు నీకు మిగుల ప్రియమగు ఆహార వస్తువును విడిచిపెట్టుము. 7 దినములలోగా నీకు శుభ మగు" నని తెలిపెను.

అందులకు నేను సమ్మతించి నాకు మిగుల ఇష్టమగు వరి అన్నము ముట్టుట మానితిని. ఆఫకీరు చెప్పినట్లు జరిగినది. మరు నాడే దొంగ నాసొమ్ము పూర్తిగా నా కిచ్చివేసి, క్షమాభిక్ష వేడుకొనెను. పిమ్మట నేను ఆ వాడా (తావు) విడిచి, ఫకీరు దర్శన కుతూహలముతో ఓడ నెక్కుటకు ఓడలరేవుకు చేరితిని. సరంగు చోటులేదని నిరాకరించెను. ఓడగుమాస్తా జాలిపడి తా వొసగెను. ఇపుడే ఇందు చేరుకొంటిని" అని కథ ముగించి "శ్యామా! వీరు శ్రమచే డస్సియున్నారు. దూరమునుండి వచ్చిరి. వీరిని రాధామాయి ఇంటికి గొనిపోయి, భుక్తి నిడు" మని ఆజ్ఞాపించెను. శ్యామా వారిని గొనిపోయి భోజనంబిడి, వారితో నిట్లనెను.

"సోదరులారా! బాబా తెలిపిన కథ చిత్రముగ నున్నది. నేను వారిని సదా వెన్నంటియుందును. వారికడ నెన్నడు

30 వేల రూకలు లేవు. వారిసొమ్ము దొంగ లపహరింపను లేదు, ఇందేదో రహస్యము ఉండవచ్చు. మీకేమైన అర్థమైనదా ?" అని వారి నడుగగా,

అందు మొదటివాడు తాను మొదటి నెలజీతము శ్రీ దత్తాత్రేయున కిత్తునని మ్రొక్కి మరచితిననియు, నిశ్చయముగ శ్రీ సాయియే దత్తప్రభువు గాన, తన్నిటకు గొనివచ్చి తనవద్ద నుండి దక్షిణ స్వీకరించిరని తెలిపెను.

ఇక రెండవవాడు బాబా తెలిపిన ఆకథ తననుగూర్చియే యని ఇట్లు చెప్పనారంభించెను. తననుండి 30 వేల రూప్యములు మిగుల విశ్వాసియగు తనవంటవాడే ఒకప్పుడు దొంగిలించె ననియు, ఫకీరురూపమున సలహానిచ్చిన బాబా వారి ఆనతి ప్రకారము తాను నేటిదనుక వరిఅన్నము ముట్టుట మానితి ననియు, ఆమరునాడే ఆదొంగ తన ధనము తన కిచ్చివైచి, క్షమింప వేడుకొనెననియు, తానా ఫకీరు తెలిపిన మహానీయుని దర్శనమునకు బయలుదేరి, ఓడలో చోటులేదని సరంగు నిరాకరించినను, గుమాస్తాదయవలన చోటు లభింప, ప్రయాణమై ఇపుడే ఇందు చేరుకొంటిననియు, శ్రీసాయి సాక్షాత్ భగవత్స్వరూపి కనుకనే, నే నిందు చేరగనే నాకథ అంతయు గుప్తభాషలో నాయెదుటనే, ముందుగ మీకు కెరింగించెనని రెండవయాతడు తనకథను ముగించెను.

రెండవయాతడు తెల్పిన యీ ఉదంతమును వినిన

శ్యామా మొదలగు భక్తులందరును సర్వవ్యాపియగు శ్రీసాయి భగవానుని అద్భుతలీలావిశేషంబులకు అమందానంద పరవశు లైరి.

శ్రీ సాయిని నమ్మి కొలుచువారలకు ఇక్కట్టులు సంభవింపవు. ఇక్కట్ల చిక్కువడిన దీనులెందరో శ్రీసాయీశుని పూజించి ఆ ప్రభువు కృపకు పాత్రులై సుఖసంపదల నోలలాడు చున్నారు.

మఱియు, ఎవరిపాపములు క్షీణించినవో, ఎవరు అదృష్ట వంతులో అట్టివారలే కలితారకంబగు శ్రీసాయీవ్రత మాచరించుచు, శ్రీసాయీ మాహాత్మ్యగాథలను మననము చేయుచు ఇహపరానందసంపత్సుఖముల పొందగల్గుచున్నారని హేమాత్పంతు రూపధారియగు వ్యాసభట్టారకునిచే శ్రీసాయీ వ్రత మాహాత్మ్యంబు నెరింగించబడియె.

ఓం నమో శ్రీసాయి

శ్రీ సాయీభక్తాః సుఖినోభవన్తు

ఇది

అష్టమాధ్యాయము.



ఓం నమో శ్రీసాయి !

## స్తుతి



"నే నుండన్ భయ మేల? నేన సయితున్
　　నీతాపభారంబు నా
పైనన్ వైచిన చాలు" నంచుఁ గరుణా
　　పారీణుఁడై పల్కు నా
మాసీంద్రార్చిత పాదపద్మయుగళున్
　　మాయాగుణాతీతు నా
శ్రీనాథున్ బుధలోకతోషుఁ దలఁతున్
　　శ్రీసాయినాథప్రభున్.



ఓం నమో భగవతే సాయినాథాయ, నిత్య సత్యస్వరూపాయ, సద్ధర్మసంరక్షణాయ, దారిద్ర్య దుఃఖ భయభంజనాయ, శాంత సాంతాది గమ్యాయ, సాధు సమ్మత హితాయ, సద్భక్త సంరక్షకాయ, సర్వాంతర్యామినే, చతుర్దశభువనాధిపతయే, సర్వ దేవ శరణ్యాయ, నాదబిందుకళా రూపాయ, శ్రీ షిర్డీశ్వరాయ,

నమస్తే - నమస్తే - నమస్తే - నమః.

SRI SHIRDI SAINADHA MAHATYAM,
(Vedoktha Puja Vrata Kalpam) **Price Rs. 1/-**

  

*For Copies :—*

*Prof:* "Peruru Sharma"
P. O. KAKINADA, (A. P.)

Sri Sai Baba Bhajana Mandali *(Regd)*
P. O. GUNTUR, (A. P.)

Sri P. M. Mohan Rao,
Sri Sai Baba Temple,
P. O. BHIMAVARAM, (W. G. Dt.)

Sri Sagun Meru Naik,
P. O. SHIRDI,
(Ahmednagar Dist.)

Shirdi Samsthan of Sri Sai Baba,
P. O. SHIRDI,
(Ahmednagar Dist.)

  